కీ. శే. ముత్తరాజు సుబ్బారావుగారి

# కచ - దేవయాని

శ్రీకృష్ణతులాభారం రచించి ప్రఖ్యాతి గడించిన కీ॥శే॥ముత్తరాజు సుబ్బారావుగారే ఈ కచదేవయాని అను పౌరాణిక నాటకమును రచించారు. అట్టి ప్రఖ్యాతియే మమ్మీ గ్రంథమును ఆంధ్రదేశమున కందజేయ ప్రోత్సహించింది. శ్రీ ముత్తరాజు సుబ్బారావుగారి కవిత్వపటిమ, రచనానైపుణి, సరళసూక్తులు తులాభార నాటకమువల్ల వ్యక్తమౌతున్నవి. నాటకవస్తు సముదాయమును గురించి వ్రాయటం చర్వితచర్వణం.

దేవాసుర సంగ్రామం దేవాసురలకు మైత్రి మూషికమార్జాలమైత్రి సదృశం. మృతసంజీవనీ విద్యకై బృహస్పతి కుమారుడు, రాక్షసగురువగు శుక్రుని శుశ్రూషచేశాడు. అష్టకష్టాలు అనుభవించాడు. గురువాత్సల్యం సంపాదించాడు. సమస్తజ్ఞాన కోవిదుడయ్యాడు. కాని కృతసంకల్పుడుకాలేదు. దేవహితం చేకూరలేదు. గురువునకు శిష్యవాత్సల్యం అగ్గలమయ్యింది. అసురులకది కంటకంగావుంది. గురుపుత్రి, కచుడ్ని ప్రేమించింది. రాక్షసులు చేసిన ఘాతుక కృత్యాలనుండి రక్షించింది. మృతసంజీవనీ విద్య కచుడికి చెప్పక తప్పిందికాదు శుక్రాచార్యునికి. అదికూడా లభించింది. ప్రయాణ సన్నద్ధుడయ్యాడు. దేవయాని ప్రత్యక్షమైంది. తనహృదయం వెల్లడించింది. నిలువున నీరైపోయాడు. ఆమె గురుపుత్రికావున సోదరి వాత్సల్యమునకు అన్యప్రేమను నిరసించాడు.

వలయువారు: వెల రు 0—12—0

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

ఓమ్

శ్రీ సీతారామాంజనేయ నమః

# రణతిక్కన

గ్రంథకర్త

ముత్తరాజు సుబ్బారావు, యం. ఏ.




పబ్లిషర్సు

కురుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రొప్రయిటర్సు, సరస్వతి బుక్ డిపో,

బెజవాడ.

1938




| | |
|---|---|
| Old Price | 0-12-0 |
| Publisher's Increase | 0-4-0 |
| Total | 1-0-0 |

ప్రథమ ముద్రణ 1000 ప్రతులు

## హెచ్చరిక



Printed at Usha Press, Telaprolu, Kistna Dist.

# పరిచయం

"మంగళాంతాని కావ్యాని" అని భారతీయుల సంప్రదాయం. జగత్తు మంగళోన్ముఖమేకాని నాశనోన్ముఖం కాదని మన విశ్వాసం. మంగళమయుడైన భగవంతుడి లీలయేగదా లోకం! విశాలమూ, ప్రసన్నమూ ఐన దృష్టితో చూసినప్పుడు లోకంలో అసలు అమంగళమే లేదు. లోకవృత్తాన్ని సంస్కరించి ప్రదర్శించే ప్రతి బింబం లాంటిది కావ్యం. కావ్యంలో అమంగళానికి తావేలేదు.

"విశ్వశ్రేయః కావ్యం" అన్నారు పెద్దలు. జగత్కల్యాణం కోరి కవి కావ్యం చేస్తున్నాడు. అలాంటి కావ్యంలో అమంగళం ఉండకూడదుగదా! భారతీయ సాహిత్యంలో విషాదాంత కావ్యాలే లేవు. యాతనా మయమయిన సంసారంనించి సహృదయుడి దృష్టిని ఆనందమయమయిన అతీత ప్రపంచంలోనికి తీసుకుపోవడం కావ్యప్రయోజనం. ఇందుకోసమే కావ్యాలు ఎప్పుడూ సుఖపర్యవసితములు కావాలి. పదార్థవాదులగు పాశ్చాత్యులు. గ్రీకులనుండి అనుకరించిన 'ట్రాజెడీ' యే ఈనాడు మనవారు అవలంబిస్తున్న విషాదాంత నాటకాలకు మాతృక. పరమార్థవాదులగు భారతీయులు 'ట్రాజెడీ' ని భావించనేలేదు.

కీ. శే. ముత్తరాజు సుబ్బారావు పంతులుగారు ఆంగ్లసభ్యతను విజ్ఞానాన్ని సమగ్రంగా గ్రహించిన పండితులు. అయినా భారతీయ సంప్రదాయంలోని అర్థవత్తను గ్రహించి వారు విషాదాంతం కావలసిన ఈ నాటకాన్ని మంగళాంతం చేశారు.

అందుకోసం ఏనాడో పోయిన భీమన్నను కాలవిరోధం గడించకుండా తిక్కనకు సమకాలికుణ్ణి చెయ్యవలసివచ్చింది ఈ కవి.

"అంతస్సన్నిధి" అని కవిబ్రహ్మ అనడంచేత నెల్లూరులో హరిహరనాథాలయం ఉన్నదనడం తప్పని, హరిహరనాథుడు తిక్కన భావించిన పరతత్త్వమేకాని రూపసహిత దేవతగాదనీ కొందరివాదం. ఈకవి జనశ్రుతి ననుసరించి హరిహరనాథుణ్ణి సరూపదేవతగానే భావించినట్లున్నది.

సుబ్బారావు పంతులుగారి నాటకరచనా కౌశలాన్ని గురించి నేను ప్రత్యేకం విమర్శించవలసినది ఏమీలేదు. యావదాంధ్రదేశం జేగీయమానంగా వెలిగిన వారి శ్రీకృష్ణతులాభార నాటకమే వారి కవితా మాధుర్యానికి, పాత్రపోషణ దక్షతకూ, ప్రదర్శనానుకూల రచనాశక్తికీ తార్కాణగా ఉన్నది.

ఈనాటకం బహుశా పంతులుగారు బాల్యదశలో వ్రాసివుంటారు. లేదా వృద్ధాప్యంలో వ్రాసివుంటారు. తులాభారంలో వికసించిన ప్రతిభ దీనిలో వికసించలేదో ముకుళించినదో కాని ఈ నాటకం కూడా సమర్థులయిన నటులు పూనుకుంటే, ప్రదర్శనంలో బాగా రాణిస్తుందనే నమ్ముతున్నాను.

తెలప్రోలు
3—6—38

ఇట్లు
పాటిబండ మాధవశర్మ, యం. ఏ.

# కథాసంగ్రహము

## మొదటి అంకము

రంగం 1: కాటమరాజు, పద్మనాయకుల గొల్లలు, మనుమసిద్ధి గోగ్రహణంబునుగూర్చి ముచ్చటించుకొనుచుండ అన్నంభట్టు దానిని విని చింతించుట.

రంగం2: కాటమరాజు, పద్మనాయకులు మంత్రాలోచన మొనర్చుచో నన్నంభట్టేగి తన రాజు రాయబారముం దెల్పి కాటమరాజు పుల్లరినీయ నీయకొనమి యుద్ధంబునిశ్చయించుట.

రంగం 3: అన్నంభట్టు తన రాయబారము నిష్ప్రయోజనంబని నుడువ మనుమసిద్ధి రణతిక్కనను వైరులపై కంపుట.

## రెండవ అంకము

రంగం 1: కాటమరాజుతో పద్మనాయక, పిన్నమనాయకులు ధర్మరణ మొనర్ప మనుట.

రంగం 2: తిక్కనసేన భగ్నమైన పిన్నమనాయకుడు మొదలగువారు మేము బ్రాహ్మణులతో పోరమని శస్త్రసన్యాస మొనర్చిన తిక్కన చేయునదిలేక వెనుదిరిగి వచ్చుట.

రంగం 3: నెల్లూరు పౌరులు తిక్కనను భీరువుగా నధిక్షేపించుట. రణతిక్కన కొడుకు తన మిత్రునివలన తనతండ్రి యకార్యమెరుగుట.

రంగం 4: రణతిక్కన కొడుకు తన తాతతో తండ్రినిగూర్చి ప్రసంగించుట. రణతిక్కనను, సిద్ధనను పరాభవించుట.

రంగం 5: రణతిక్కనను తన భార్య చిన్నపుచ్చుట.

రంగం 6: రణతిక్కనను తనతల్లి పరాభవించుట. రణతిక్కన యుద్ధమున కేగుట.

## మూడవ అంకము

రంగం 1: మనుమసిద్ధి అన్నంభట్టు యుద్ధమును జూచుచుండుట

రంగం 2: రణతిక్కన సైనికులు పారిపోవగా దానొక్కడు బ్రహ్మరుద్రయ్యతో బోరాడి యిరువురు వీరస్వర్గ మలంకరించుట. మనుమసిద్ధి యన్నంభట్టుతో యుద్ధభూమికేతెంచి తిక్కన మరణవార్త విని పగతీర్చుకొన ప్రతినబూనుట.

రంగం 3: సమరమున నిహతుడైన రణతిక్కనను గురించి యన్నంభట్టు, సిద్ధనాదుల కెరిగించుట. జానాంబ సహగమన మొనర్ప నుద్యుక్తురాలగుట. వేములవాడ భీమకవి తిక్కనను బ్రతికించుట.

# నాటక పాత్రములు

## పురుషులు

మనుమసిద్ధి— నెల్లూరురాజు
కవితిక్కన— ,, మంత్రి
రణతిక్కన— ,, సేనాని
సిద్ధన— రణతిక్కన తండ్రి
అన్నంభట్టు— రాయబారి, మంత్రి
గొల్లలు— రాముడు, మల్లడు, పుల్లడు; వీరడు
చిన్నతిక్కన— రణతిక్కన కొడుకు
మంచన— ,, మిత్రుడు
కాటమరాజు— ఎఱ్ఱగడ్డపాటి ప్రభువు
పద్మనాయకుడు— పల్నాటి ప్రభువు
పిన్నమనాయుడు— పల్లికొండ ప్రభువు
బ్రహ్మరుద్రయ్య— ,, సేనాని.
సేవకుడు భీమకవి
నెల్లూరిపౌరులుమల్లంభట్టు సుబ్బిశెట్టిరామిశెట్టి
సుబ్బారెడ్డి కొమ్మన

## స్త్రీలు

జానాంబ— రణతిక్కన భార్య.
ప్రోలాంబ— రణతిక్కన తల్లి.
బాలామణి— పుష్పలావిక.

# నాంది

మ॥ సుమనస్సంయుతుఁడై సుచంద్రిక తనూ
జుండై కలి స్మర్త్యజ
న్మమునుం గాంచి నికుంభ దానవుని దు
ర్మార్గంబుచే గుందు నాం
ధ్రమహామండలవాసులందరును జే
తం గొన్న శ్రీకాకుళాం
ధ్రమహావిష్ణుపు బ్రోచుఁగాత మిము ధై
ర్యస్థైర్యసంధాయియై!

* ( గీతము )

ఉ॥ పావనమత్స్యరాజు కుల
వార్నిధిసోముఁడు సుబ్బరావు భూ
దేవకులావతంసు రణ
తిక్కన గాథను నాటకంబుగాఁ
గోవిదులార వ్రాసె నది
కూర్చి ప్రదర్శనముం బొనర్చుచో
నేవయినన్ దోసంగు లుద
యించిన మమ్ముల నెమ్మిఁ బ్రోవుఁడీ!

ఉ॥ నాటక నాయకుండు మఱి
నాటకముఁ రచియించినట్టిడుఁ
నాటకపాత్ర ధారులును,
నాటకముఁ దిలకించువార లీ
పాటికి మేటి సింహపురి
వాసము జేసినవారు చేయువా
రౌట సమస్త భంగుల ము
దావహమై యిది మించుట బ్రమే?





# రణతిక్కన



## ప్రథమాంకము

### = ప్రథమరంగము =

స్థలకము— పినాకినీప్రాంతభూమి.

(కాటమరాజు పద్మనాయకుల గోపబాలురు నెగడివేసికొని చలి కాచుకొనుచుందురు. అన్నంభట్టు మెలమెల్ల ప్రవేశించి పొంచి వినుచుండును.)

రామి: వీరయ్యా! తర్వాతేమి జరిగిందోయి?

వీర: ఏముంది? మందంతా మాటుమణిగింది. మేము యేఖైమందిమి మెల్ల మెల్లగా సద్దు చప్పుడు లేకుండా యెల్లి కాపలా చేసే గొల్లవోళ్ళను చుట్టుకున్నాము.

పుల్ల: భలే చేసావోయి. తరువాత.

వీర: వాండ్లు పాపం! ఆదమఱచి నిద్రపోతున్నారు. మేముపోయి ఒక్కసారి కిలారించేటప్పటికి నిద్రనుండి లేచారు. లేచి మమ్ముల్ని చూచి ఎవరుమీరు, ఎందుకొచ్చారు? అన్నారు.

రామి: తర్వాత.

వీర: మేము కాటమరాజు బంట్లము. మిమ్మల్ని చెరబట్టి తెమ్మంటే వచ్చామున్నాము.

రామ: వారిది యన్యాయమనలేదా?

వీర: అన్నారు. అంటే మాకా మాటొక నెక్కా? మారాజేం చెయ్య మంటే చెయ్యొద్దూ?

రామ: ఈరయ్యా! సైనికులంతా రాజుచేతి బొమ్మలోయి.

వీర: నీవు సేనలోవుంటే నీ వేమిచేస్తావో తెలిసేది?

మల్ల: పోనీవోయి. తర్వాతేం జరిగింది?

వీర: వాండ్లదగ్గర కత్తులా కటారులా? పాపం ఏమిచేయుటకును దోచకపోయింది. అప్పుడు మేము వాళ్ళను కట్టితెచ్చాము.

పుల్ల: ఆవుల నేమి చేశారు?

వీర: ఆవులను, దూడలను, కోడెలను, అప్పుడే మనవూరివైపు బంపించాము.

రామ: ఇదెంత ద్రోహము! మా రాజిందుల కొప్పుకొనునా?

వీర: పద్మనాయకుఁడు మా రాజు పోసగువదలినవాఁడే కదోయి?

రామ: అయితేమాత్రం? అతఁడీ యన్యాయమున కొప్పుకోఁడు.

వీర: ఒప్పుకొనేను, ఒప్పుకొనకపొయ్యేను. ముందుగా కార్యమైపోయిందికదా?

పుల్ల: మన ఆవులెందున్నవిరా?

వీర: ఈ ఒడ్డునరాత్రికి రాత్రే చేర్చాము. కోడికూతతోనే, మనము వాటిని వెంటపెట్టుకొని ఊరికి దొంగదారిని బయల్దేరాలి.

పుల్ల: అట్లయితే తొందరగా యిల్లు చేర్తాముగంబా?

రామ: నాకుమాత్రము సంతోషముగా లేదోయీ? ఈ దోపిడి దొంగతన మెందుకోయీ?

వీర: ఛరే రామిగో! రాజులనడవడి మనకర్థమౌతుందటోయి! వారెట్లు చెప్తే మనమట్లా చెయ్యాలి. తర్వాత దాన్లో పుణ్యంపాపం వారిదే!

పుల్లి: అదిగో కోడి కూస్తోంది. పోదాంరండి.
వీర: లేవండిరా యెల్దాం. (నిష్క్రమింతురు.)
అన్నం: అక్కటా! యెంతమోస మెంతమోసము.

మం॥ నిజదేశంబునఁ గాటకంబడర దానింబాసి గో గోపక
వ్రజమున్ దోడ్కొనివచ్చి మానృపుని సంప్రార్థించి, మాబీళ్ళక
క్కజమా బుల్లరినిత్తు నంచపుడు వాగ్దానంబుగావించి యి
క్కుజనుం డిప్పుడు మమ్ముకారణము సంక్షోభింపగా జేయునే?
కాలమరాజుబోలు పాపాత్మునకుఁ బుణ్యామొనర్పఁ బూను
కొనినఁ బాపము వెంటనంటకుండునా?

కం॥ ఉపకారమునకు మారుగ
నపకారమొనర్తు రధములను ప్రానుడీ యీ
నృపపాంసను చక్యలచే
స్వపరంబున గూఢియయ్యె, సాధ్వసమేలా?

ఇదే ఆ ధూర్తుసన్నిధి కేగి యుచితరీతి మందలించి ధర్మోపదే
శంబొనర్చి చూచెద. (ఒకటిరెండడుగులు వైచి) అక్కటా!
ఈ మదాంధుడేమి? నా సద్బోధను వినుటేమి? సమరపిపా
సులకు సద్బోధలు రుచించునా? మఱియు నాతఁడు నా తిర
స్కారపు బల్కులకు గనలినన్నూరక విడుచునా? అట్లాలో
చింప నా రాయబారము వ్యర్థమగునని తోచుచున్నది. ఏమి
సేయుదును? వెనుక కేగుదునా? (ఆలోచించి) ఛీ!

శా॥ కానీ యింతటి స్వల్పకార్యమున వెన్కందీయఁగా నేల? భూ
జానివేఁపిత సామవాక్యముల విజ్ఞాపించి, యూపైన నీ
త్మ్మనా ధాధను:డే విధానఁ దనవాగ్దానంబుఁ బోనాడునో
యే న్యాయంబున నుత్తరంబొసఁగునో యే గాంచివర్తించెదన్.

(నిష్క్రమించును)

= ద్వితీయరంగము =

స్థలకము— సభాభవనము. పినాకినీతీరము.

(కాటమరాజు పద్మనాయకు లాశీనులై యుందురు.)

కాట: మిత్రమా! నీ విట్లు నాయాశయ మెరంగనట్లు వాక్రుచ్చిన
నే నేమని ప్రత్యుత్తరం బీయగలను? అయిన

చం॥ గణపతి రాజశేఖరుఁ డకారణబంధుత వీని శత్రు రా
డ్గణముల నెల్ల సంగరముఖంబున మార్కొని గెల్చి, రాజ్య మ
ర్పణ మొనరింప చేకొనిన వాసరమాదిగ వీని సంగరాం
గణమున దాఁక నేను గుతుకం పడుచుండుట నీ వెఱుంగవే?

పద్మ: మిత్రా! నీవు మనుమసిద్ధిని గెల్చి వాని రాజ్యము నాక్రమించు
కొనవలయునని యువ్విళ్ళూరుచుండుట నే నెరుంగని విషయ
ము కాదు. అయిన నీ తరుణమున నా ప్రశంస యేల? మన
మింకను నాతని రాజ్యపు సరిహద్దులలోననే యున్నారము
గదా?

కాట: ఇఁక కొన్ని ఘడియలలో మన మాతని రాజ్యపు పొలిమేర
దాటిపోగలము. దాని కేమిగాని యీ రణంబున నీవు నాకు
సాయ మొనర్చెదవా? లేదా?

పద్మ: అందులకు సందియమా? గణపతిదేవుఁడును వాని యాశ్రితు
లును మాకుఁ బరమశాత్రవులుగదా? అయినఁ దీనికిఁ దగు
కారణ ముండవలయుగదా? నిష్కారణముగఁ గయ్యమున
కుఁ గాలుదువ్వుట పాడికాదు. ఒకవేళ నీ వట్లొనర్చినను, మం
త్రి తిక్కన్న మనుమసిద్ధిని యుద్ధమునకుఁ గడంగనిచ్చునా?

కాట: కారణము లేదని భయపడకుము. మనుమసిద్ధి కేను బుల్లరినిత్తు

నని బీళ్ళు గుత్తకు గైకొంటిని. దాని నింతవర కీయలేను. ఇంక నీయబోను.

పద్మ: మిత్రమా? ఆడిన మాట తప్పుట పాడియా? కీర్తి కరమా?

సీ॥ ఘన హరిశ్చంద్రుండు, కాటికాపరియౌట
యనృతమాడుట యఘమనియె కాదె?
బలిచక్రవర్తి తా బాతాళ గతుడౌట
యనృతమాడుట యఘమనియె కాదె?
ధర్మాత్ముడౌ శిబి తనువు గోసియిడుట
యనృతమాడుట యఘమనియె కాదె?
బుద్ధిమతీదేవి పుత్ర మాంస మిడుట,
యనృతమాడుట యఘమనియె కాదె?

తే|గీ॥ కష్టములె సంఘటిల్లిన, కాననమున
వాసమే ప్రాప్తమైనను వారలెల్ల
సత్యదీక్షను విడిరె? యీ క్ష్మాతలమున
సత్యమే సుస్థిరత్వంబు సుఖ ప్రదంబు.

ఇదియునుంగాక నొక్క విషయ మాలోచింతము.

ఉ॥ పుల్లరి నిత్తుమంచు మునుముం దను రాడితి రంత నాధరా
వల్లభు డాలబీళ్ళను గృపామతి నిచ్చెను; బీటిపట్టులం
దెల్లెడ నాల మేపికొని, యిప్పుడు బుల్లరి నీయనన్న నిన్
గల్లరివంచు సాటి నరకాంతులు నోరును బుచ్చ్వ రోయరే?

కాట: తిట్టిన దిట్టనిమ్ము. ఆటిట్లు నన్నేమి సేయగలవు?

పద్మ: ఇంతమాత్రమున కాతడు యుద్ధమునకు దిగకున్నచో?

కాట: అట్లొనర్చునేమో యని సంశయించి ప్రాంతభూముల మేయు
చున్న వారి గోవులను గోపకులతోడ బంధించితిమి. ఇంక

యుద్ధము నిశ్చయము.

పద్మ: పుత్రా! ఎట్టి కార్య మొనర్చితివి? ఇట్టి యుద్ధము జయప్రద మగునా?

కాట:

ఉ॥ ఈతఱి గాతరంబు వహియించెద వేల? హితాగ్రగణ్యయా!
భూతలనాథు భూరిబలముం దిలకించితివో, యట్లుకానిచో
నాతని వాహినీశుల సమర్థత గాంచితివో? యేదిగానిచో
గాతరమేలనయ్య! నరకాంతుల కాహవమన్న గోత్రమే?

పద్మ: మిత్రమా! నాకు యుద్ధమన్న గోత్రగాదు. అధర్మ యుద్ధమన్న గోత్ర. అందువలన నిట్లుశంకించెద.

కాట: మిత్రమా! యుద్ధలోలుపులకు ధర్మమేమి? యధర్మమేమి?

పద్మ: అవును. 'రాజ్యాతురాణాం నగురర్నబంధుః' యనలేదా?

కాట: అదిగాదు. మనము బలవంతులమైనపుడు, మనశత్రువులు బలహీనులుగ నగుచుండునపుడుగదా యుద్ధమున మంచి తరుణము. మఱియు ధర్మము ధర్మమనియెదవు. ధర్మసూక్ష్మము నెవ్వరెఱుంగుదురు? రాముడు వాలిని, ఇంద్రుడు నముచిని, యర్జునుడు కర్ణుని, ధర్మయుద్ధముననేనా చంపినది? ఇట్టిమహానుభావులే యధర్మరణమునకు గడంగ నా బోంట్లకేమి?

పద్మ: మిత్రా! ఇట్టిమాటలు లోకముగణించునా?

ఉ॥ రాముడె తల్లిజంపె బలరాముడె మద్యపుసేవజేసె, సు
త్రాముడె యన్యగూడె, రఘురాముడె వాలిని నీతిగూల్చెగా
నేమును పట్లొనర్ప దగదేయన లోకమునొప్పునే, పరం
ధాముడొనర్చినం గలుమధర్మముమాత్రమె నగ్రాహ్యమయ్యెనే?
మఱియు నార్యులు ధర్మమేవ జయతియని నుడువరో మన

కిందు జయము లభించునా? ధర్మమే పరమేశ్వరస్వరూపము. ధర్మము గలవారికే జయము ధ్రువము.

కాట: మిత్రా! నీ బేలతనమునకు నే నేమందును?

చ॥ ఎరుగని వానిబోలె నిటులేటికి బల్కెదవోయి మిత్ర! సం
గరమున శౌర్యవంతులకుగాక నయాఢ్యులకుం జయమ్ము సే
కురునని యేరొ వ్రాయ నభుకుర్ణ వహించెదె? చేతగాని వా
రరిజనపీడనం బుడుపు నాసను వ్రాసిన వ్రాత లిట్టివే.

మరియు జయంబు తప్పక మనకే చేకూరునట్లు సన్నాగము బన్నితిని.

ఉ॥ ఈ మన మీ కుమారధవుని నెక్కటి కయ్యమునందు దాకగా
క్షేమముగాదు నాకని రచించితి లేఖల మిత్రకోటి కిం
కీమెయి గొంకుజంకు దృజియించి మదీయ హితంబునెంచి సం
గ్రామతలంబునందు సహకారమొనర్చి జయంబుగూర్చుమీ.

( సేనకుడు ప్రవేశించును. )

సేవ: దేవా! ద్వారమున మనుమసిద్ధిగారి రాయబారి యన్నంభట్టు వచ్చి దేవర దర్శనార్థము వేచియున్నాడు.

కాట: నే ననుకొనినట్లే రాయబారి వచ్చెనా? లోనికి రానిమ్ము.

(సేనకుడు నిష్క్రమించును)

కాట: మిత్రమా! మన మిత్రులందరు తమ తమ సేనలతో బెదజల్లె పల్లెయందు విడిసి మనకై వేచియున్నారు. కావున మారాడక కర్తవ్యంబునకు గడంగుము.

(అన్నంభట్టు ప్రవేశింప గాటమరాజు, పద్మనాయకుడు నమస్కారమొనర్ప నాశీర్వదించి యుచితాసనాసీనుడగును.)

పద్మ: భూసురవర్యా! మీ రాజునకు సేమమే గదా?

అన్నం: భూపాలా! భగవత్కటాక్షమున సేమమే? మీకును భద్రమేకదా?

కాట: అవును. మీరాజు మా కంపిన రాయబార మేమని?

అన్నం: ఇదిగో నుడివెద నాలకించి తగిన ప్రత్యుత్తరం బొసగి నన్నంపుడు.

శా॥ మీరాజ్యంబున గాటకంబు వొడమన్ మీ రెల్లమీయాలతో
మా రాజ్యంబును జేరి మిత్రులవలె న్మాబీళ్ళనుం గుత్తకై
కోరం బుల్లరి కొంత యేర్పరచి మీకున్ హానిజేకూర్ప మీ
రౌరా! పుల్లరి నీయకుండుట నయంబా కాటమోర్వీశ్వరా?

మ॥ ఎపుడో యిచ్చెదమన్న పుల్లరిని మీరిందాక నీకుండ, వే
నెపముల్ చెప్పుచు బొ్రద్దుబుచ్చుటను సందేహంబుగానున్న దిం
కిపుడేనిం ద్ఋణభాగధేయమును మా కీనెంతురో లేక మా
యుపకారంబును వీటిబుచ్చి చనగా నూహింతురో తెల్పుడీ!

ఇదియె నా రాయబారము. ఇక బ్రత్యుత్తరమునకు నిరీక్షించుచున్నాడ.

కాట: దీనికి బ్రత్యుత్తర మేమున్నది? మే మేమియు బుల్లరి నీయనవసరము లేదు.

అన్నం: ఇది విశ్వసనీయమా? అదెట్లు?

కాట: ఆ విషయము మీ రెరుంగనిదియా? మేము మొదటి నెలకే బటిమాడల నిత్తుమని మీ బీళ్ళను గుత్తకు బుచ్చుకొంటిమి. పుచ్చుకొనిన వారము దినముల లోపలనే దొమ్మ దగిలిన మా గూడలు నూటికిబైగా మరణించె. అంతమేము మా గోవుల దోలుకొని దక్షిణదేశమేగి యక్కడినృపాలురకు బుల్లరి నొసగి యాలమేపుకొని సురక్షితముగా వచ్చుచున్నార

ము. కాటకంబువలన నిచ్చే మాకత్యంత నష్టము గలిగె గాన మేము పుల్లరి నీయదలచుకొనలేదు.

అన్నం: ఆర్యా! ఆ కాటకంబునకు మీ దురదృష్టముగాక మేముత్తరవాదులమా?

కాట: కానిమ్ము. కాకపోనిమ్ము. మాకు నష్టమైనది మాత్రము నిజము.

అన్నం: అట్లయిన మీరు మేపుకొని నంతవరకు మాకు బుల్లరి నిచ్చి మీ మాట మీరు నిలుపుకొనుడు.

కాట: మేమొక్కకాసైన నిచ్చువారము కాదు. మే మేమియు నీయ నవసరము లేదు.

అన్నం:

ఉ॥ ఎల్లెడవానలేమి దపియించుచు మీరరుదెంచి యాలకై
బీళ్లను గుత్తకిమ్మనుచు వేడిన బుల్లరి నిశ్చయించి, మే
మల్లన మీ కొసంగ నపుడట్టుల నైకొనలేదటం చిసీ,
కల్లరివై వచింతు వుపకారికి బ్రత్యుపకార మిట్టిదే?

ఇట్లాడిన నేమి సంభవించునో మీ రెరుగుదురా?

కాట: ఆహా! యుద్ధము. అదియే మాకు వాంఛనీయము.

అన్నం: ఏమీ! వృథాగా గయ్యంబునకు మమ్ము జీరెదరా?

మ॥ నునుమత్ప్రభుతి పౌర జానపద సామర్థ్యంబునుం గాని, తి
క్కన మంత్రీశ్వరు రాజ్యకార్యఘటనా గాంభీర్యముంగాని, తి
క్కన సేనాధిపు శత్రుభేదరచనా కౌశల్యముంగాని, మీ
మానమందెంచిన వారితో సమర సంరంభంబు గావించెంతురే?

కాట: అన్నంభట్టసా! నీ వెంతభట్టుమూర్తివలె మీ పౌరుల శక్తిసామర్థ్యంబుల నుగ్గడించినను మాకు నిజము తెలియదా?

పద్మ: స్వపక్షస్తోత్రంబు సర్వజనులకు సాజమ్ము కదా?

అన్నం: భూవరులారా! ఇది స్తోత్రముగాదు. యధార్థము సుకీ మనుమసిద్ధిరాజేంద్రుని విక్రమాదులు విూ కెరుకపడినట్లు లేదు.

సీ॥ తన ప్రతాపము వైరి జనతా మదాంధకా
రమున కఖండ దీపముగ జేసి,
తన చరిత్రంబు నాత్మప్రజాసమ్మోద
లతికకు వాల వాలముగ జేసి,
తనకృపారసము బాంధవకవిజన చకో
రములకు జంద్రాతపముగ జేసి
తనకీర్తి జాలమవని శారికకు నభి
రామ రాజితపంజరముగ జేసి
తే॥గీ॥ తనమనోహర రూపంబు వనజలోచ
నాళి దృగ్బాణములకు లక్ష్యంబుగాగ
యలరువైరి వేశ్యా భుజంగాంక మనుమ
సిద్ధితో సాటియెవ్వ డశేషజగతి?

ఇక నాతని సేనాపతి ఖడ్గతిక్కన జగద్విఖ్యాత కీర్తి విభూషితుండు.

ఉ॥ మాపతి సన్నిభుండనుపమాన యశోనిధి ఖడ్గతిక్కన సే
నాపతి కేవలుండె, చిననాటన దైవ కటాక్షవీక్షణ
ప్రాపిత విక్రముండయి నృపా! రణతిక్కన నా బ్రమత్త నా
నాపరిందిలోక రచనామతి పాత్రతగాంచు టెంచవే?

ఇకనీతని పితృవ్యపుత్రుండును కవి బ్రహ్మయునగు మంత్రి తిక్కనయో?

చం॥ ఎతడు కళాసముద్రుఁ, డెత డెల్ల కవీశ్వరబృందరక్షకుం
డెతడు యశోవిశాలుఁ, డెత డీశ్వరభక్తివిభూషితుండునా
నితడె యిటం డెదక్క మరియెవ్వడులే డిలపైననంచు సం
స్తుతిగను తిక్కమంత్రిఁ నరుతో నలదూచగలార లుందురే?

కాట: ఓయీ! నీవు మనుమసిద్ధిని, రణతిక్కనను స్తుతించిన గొంత సమంజసముగా నున్నది గాని కైతగాడగు కొమ్మన తిక్కనను స్తుతించుటెంతయు వింతగా నున్నది.

అన్న౦: ఏమీ! నీ యభిప్రాయముకు గవులితరులకు దీసిపోయిరా?

సీ॥ ఆనకయే యమృతాంభఃకణంబుల
రుచి విశేషములను బ్రచురపరుప
చూడకయే మారు సుందరాకారంబు
హృదయంగమంబుగా నెరుకపరుప
అంటకయే పుష్కలావర్త కాముల
దివ్యప్రభావంబు తేటపరుప
వినకయే నారద వీణారవంబుల
విపుల నినాదంబు విశదపరుప

ఆ॥వె॥ వాసనం గొనకయె పారిజాత లతాంత
ముల సుగంధ గరిమ తెలియ బరుప
కవులకంటె దక్షు లవనిపై గలరొయి?
రవియు గననిదాని గవులు గనరె?

కాట: (నవ్వుచు) చాలు. చాలు. నీ స్తోత్రపాఠములు ముగిసెనా? ఇటు వినుము.

ఉ॥ ఇంతకుమున్ను మే మెపుడొకింతయు మీ మనుమావనీశు వి
క్రాంతి నెరుంగనట్లు పలుకం గమకించెద వేల? ఆ క్షమా

కొంతును బయ్యనాక్కనలు కాశ్యపి గైకొన గాకతీయ భూ
కాంతుని వేడి రాజ్యమును గ్రమ్మఱ గైకొను టేమెఱుంగమే?
గణపతిదేవుడు అక్కన బయ్యనల నోడించి మనుమసిద్ధిని బున
రభిషిక్తు జేసి నెల్లూరి చెఱువు గట్టించినది మే మెఱుంగమా?
నీ మాటలయందలి యథార్థమంతయు నిట్టిద. నీ కవియు నస
మర్థుడే.

అన్నం: నా మాట లవిశ్వసనీయములా? కానిండు. యుద్ధరంగమున
సిఱుఁగుల నందునాడు మీకు నిజమెఱుకపడును లెండు. ఇక
యుద్ధము సాఘియేనా?

పద్మ: పాలుడా! మమ్ము మాటలచే బెదరించి జయమంద నీవు వచ్చి
నట్లున్నదే? కాటిరాకు చప్పుడులకు గుండేళ్ళు బెదరునా?

ఉ॥ యుద్ధము మేమెఱుంగమనియో మును యోధుల గాంచమంచునో
యుద్ధము యుద్ధమంచు బ్రిబిలోద్ధతి మాకడ నిట్టులీవసం
బద్ధపు మాటలాడెదవు పారుడ యెత్తరినైన యుద్ధసం
సిద్ధుల మే మటం చెఱిగి సింహపురీశ్వరుతోడ జాటుమా!

అన్నం: భూవరా! అట్లే నిస్సంశయముగా నుడివెదను. కాని మీరు
వేగిరపడక మరల యోజించి ప్రత్యుత్తర మిండు.

కాట: మే మంతయు గూలంకషముగా జర్చించియే యిట్లు నిశ్చయిం
చితిమి.

అన్నం: మీరు మే మొకవేళ నోడినను మా పగ దీర్చుటకు గాకతీ
య నృపాలు డున్నాడని మరచితిరి. అతడు మీ బోంట్లకు
దుర్జయుడు సుమా! కుడిచి కూర్చుండలేక, నిష్కారణముగ
గయ్యమునకు గాలుద్వి యేల వినాశ మందెదరు?

కాట: ఓహో! శ్రుతిమించి రాగమున బడుచున్నదే?

ఉ॥ ఔర ధరామరాధమ! భయంబును బోవిడి మమ్ము బోలు శూ

రాఁగి మదేభసింహుల సమక్షమునందొక వందివోలె, మీ
వారిని సంస్తుతించి పెరవారల జుల్కన జేసి పల్కెడో
రోరి యిటుల్వచింప దగునో తగదోయని యెంచ నేరవే?

ఇంక నీ విట్టులాడిన నీ నాలుక వ్రీల్చివైచెదను.

అన్నం: కాటమరాజా! ఎంతటి శూరవరేణ్యుడవు? నేను బ్రాహ్మణుడనని, దూతనని, మరచి నా పైకి జెలరేగెదవు. మీ వారందరిట్టి ధర్మజ్ఞులు నిట్టి విక్రమాఢ్యులేనా?

కాట: ధూర్తా! మాతో జెరలాటము లాడెదవా? నోరుమూయకున్న నీ యసువుల దీసెదనుసుమా?

( లేచి కత్తిలాగును )

పద్మ. మిత్రా! శాంతింపుము. శాంతింపుము. ఇతనిపై కోపముదగునా?

ఉ॥ నీతివిశారదుండవ వనీధవచంద్రమ! సింహపట్టణ
క్ష్మాతల నాధుడంప దమ సన్నిధికిం జనుదెంచినట్టి యీ
దూతుని మాటలంగిని దూషిల జేయగ నెంతువయ్యయో
దూత వచించు వాక్యముల దోసము లెంచుట రాజధర్మమే.

అన్నం: పద్మనాయకా! ఈ దురాత్ముని నేల వారించెదవు? రానిమ్ము. తానిచ్చిన మాట తప్పు వానికి ధర్మాధర్మ మెక్కడిది.

కాట: ధూర్తా ఇక నీ గాయఁబారము చాలును నీవేగుము.

ఉ॥ మాటల కేమిగాని యెటో మాటకు మాట వచింపవచ్చు ను
మ్మాటికి నేను పుల్లరి సమర్పణసేయగనొల్ల నింక పై
బోటరులేని మమ్ము రణభూమిని మార్కొని పుల్లరిన్ నిరా
ఘాటముగా గొనుండు కొనగల్గిన నీవును నీన్నృపాలురున్.

అన్నం: సరే. కానిమ్ము. దీనికి బ్రతిఫలము సత్వరమనుభవించెదవు గాక.

కాట: ఈ గ్రుడ్డిబెదిరింపుల కేమిగాని పొమ్ము.
అన్నం: ఎవరివి గ్రుడ్డిబెదిరింపులో చూచెదవు లెమ్ము.

ఉ॥ ధారుణీనాథులార! యిటు దంభములాడెడివారు మీరో మే
మో, రణమందు దిక్కన సముద్ధతిమై సభటాశ్వకంబుగా
జేరిచి, చుట్టుముట్టి నిరుపీకొనరించుచు మిమ్ము సర్వసం
హార మొనర్చునాడు తెలియంగల రందనుక న్సుఖింపుడీ.

(నిష్క్రమించును)

కాట: మిత్రా! ఈ పేర్లరి వెడలిపోయె. ఇకరమ్ము. యుద్ధమునకు సర్వసన్నాహమొనర్చి పెదజల్లిపల్లెలో మన మిత్రభూపతుల గలిసికొందము.



= తృతీయరంగము =

స్థలకము— సింహపురము, మనుమసిద్ధి కొల్వుకూటము

(మనుమసిద్ధి సింహాసనస్థుడైయుండును. రణతిక్కన ప్రక్కన నాశీనుడైయుండును. కవి తిక్కన్న భారతము చదువుచుండును. విదురనీతి చదువుచుండును. దౌవారికుడు ప్రవేశించి యందరకు నమస్కారము లొనర్చును)

దౌవా: దేవా! ద్వారమున నన్నెంభట్టుగారు వచ్చియున్నారు.
మను: త్వరలో లోనికి బ్రవేశపెట్టుము. (దౌవారికుడు నిష్క్రమింప) మామా! నేటికి భారతమును గట్టిపెట్టుడు. అన్నంభట్టు యేమి వార్త తెచ్చెనో?

ర.తి: అంసులకు సందియము మీ మనంబులగాని మా మనంబుల
గాదు.

(అన్నంభట్టు ప్రవేశించి తిక్కనలకు నమస్కరించి మనుమ
సిద్ధిచే బ్రియుతు లంది యుచితాసనాశీనుడైనంత)

మను: మంత్రివరా నీ వేగిన కార్యము జయప్రదమాయెనా?

క.తి: ధరేశా! యడుగకయే యాతని ముఖవైఖరి మీకు దెల్పుట
లేదా?

అన్నం: దేవా! తిక్కన సంశయించినట్లే యయ్యె.

ఉ॥ ఏమని విన్నవింతు ధరణీశ్వర! పుల్లరినిమ్మటన్న మీ
కేమియు నీయనక్కరయొకింతయు లేదని యంతబోక సం
గ్రామము సంభవాకి తమరాజ్యము సర్వమునాక్రమింతు నం
చామడియుంచు పల్కె నికనైన బ్రతిక్రియ జేయ జూడుమా!

మను: ఆహా! ఉపకార మొనర్ప నపకార మొనరగుట యిట్టిదేకదా.
ఎంత కృతఘ్నత:

శా॥ మాదేశంబున గాటకంబు వొడమన్ మావారితో నాలతో
మీదేశంబున కేగినార మికపై మీచిత్త మంచాడగా
గాదంచాడక బీళ్ళ బుల్లరికొసంగన్ వాడు నేడిట్టు లా
హా! దాక్షిణ్యముపీడి మమ్ము గలచన్ యత్నించు నే ధూర్తుడై!

ర తి: దుర్జనున కుపకార మొనర్ప బ్రతికృతి యిట్టిదియకదా.

అన్నం: దేవా! మరియొక విశేషము. ప్రాంతభూముల మేయుచున్న
మన యావుల నెల్ల బట్టుకొని తన దేశంబునకు గొంపోయె.
ధైర్యమున్న వానిని బుల్లరిని రణరంగమున మము దునుమాడి
గ్రహింపుడనియె.

మను: ఆహా! ఈధూర్తుడెంత యుండగ మొనర్చె. మంత్రులారా! ఇంక

గర్తవ్యమెద్దియో వచింపుడు.

కవి: రాజేంద్రా!: కర్తవ్యము మమ్మడుగవలయునా? రాయబార సందేశమే దాని వ్యక్తీకరించు చుండుటలేదా?

ఉ॥ బాపనవారి రాజ్యమని పైకొని గెల్వగగోరునాతఁడో
భూపవరేణ్యా! మీరడుగు పుల్లరి నిచ్చెదువారె వారు? మీ
రోపినయుద్ధమొండె, మఱి యోపకయుండిన మానమొండెగా
కాపయి గార్యమేమి గలదయ్య వచింపగ మమ్ములోంట్లకున్

రణ: రాజా! నా యభిప్రాయము గూడ నదియ.

చం॥ పసులను దోడితెచ్చితిమి బాగ్రధనముం బొనరించి, మేతకై
వసతులనిండు పుల్లరి నవశ్యమొసంగెదనంచు బాసలిం
పొసగనొనర్చి యిారలిపుడోపిన గొండను దుష్టచిత్తు బా
రి సమరకుండ నూరకచరించుట పూరుషధర్మమే నృపా!

అన్నం: నా యభిప్రాయము నదియే?

ఉ॥ కాటమరాజు నాకు సహకారము సేయుగలాడు మేటి ప
ల్నాటి ధరాధినాథుడని న్యాయము నైతము విస్మరించి కై
లాటమొనర్చి ధేనువతులన్ గొనిపోవగ సాహసించె, మీ
పోటుతనంబు జూప నిదె పో తరుణంబు ధరాధినాయకా!

మను: మంత్రులారా! నా యభిప్రాయము నదియ. ఇంక నేటినుండి నీ దుష్టజన శిక్షణంబున సప్రవృత్తులమై పాటుబడవలయును.

ఉ॥ మీరు వచించునట్టులు సమీాకమె యా చరణీయమైన, నా
వైరుల యుద్ధరంగమున బైకొనిపోరగ సైనికాది సం
వారముతోడ రమ్మనుచు వ్రాసెద మిత్రులకంతదాక మీా
రోరుపు నేరుపుం గదుర యుద్ధనిషక్తిని జిక్కబట్టుడీ!

మామా! మీ యభిప్రాయమిదియే గదా?

కవి: అన్నను! ఈ కాలవిలంబనము మనకు జయము దప్పకకూర్చు.

రణ: దేవా! ఈ కాలవిలంబనము నాకెంత మాత్రము నచ్చదు.

ఉ॥ ఆలము జేయుబూనినపు డాలమొకింతయులేక, వైరిభూ
పాలుర యుద్ధరంగమున బైకొని పోరి జయంబుగాంచగా
బోలునుగాని యిట్లుహితభూపులరాకకు వేచియుండ్రె భూ
పాల! శుభస్య శీఘ్రమను ప్రానుడి మీ రెపుడాలకింపరే?

అన్నం: ఆలస్యమమృతం విషమను నార్యోక్తి దలంపుడు. మరియు
మీ కీవిషయమున బరసాహాయ్యమేల?

ఉ॥ వారలు నీరలేల యటువంటి యవాముకు, నాతతాయి, నా
భీరకులాధమున్, సమరభీరువు సంగరరంగమందు సం
హార మొనర్చి కీర్తిగన నైకరణాంగణ సమ్ముఖస్థ శూ
రారి మదాభిమాన హరణాంకుడు తిక్కడొకండు చాలడే?

ర.తి: భూవరా! అన్నంభట్టు వాక్యము లాదరణీయములు. కాటమరా
జపుడు స్వల్పసేనావృతుడై యున్నాడు. నాకు వేయిరౌతుల
నిచ్చిన వారివెంట గొని యాతడూరు చేరకమున్నె, వాని
నడ్డగించి మన గోగణంబులను, గోపాలురను, మనకు రావల
సిన పుల్లరిని దప్పక తెచ్చెదను. కాలవిలంబన మగుకొలది
వైరి బలమెంత యభివృద్ధిజెందునో చెప్పవలనుపడదు. ప్రాం
తముల నృపాలురందరు కాకతీయులకు వైరులగాన వానికి
సాయ మొనర్చెదరేమో? కావున నన్ను బంపుడు. తప్పక,
సత్వరమ మీ కార్యము జక్కబెట్టి వచ్చెద.

అన్నం: ఆర్యా! అట్లేయొనర్చుటకు సంశయింపకుడు.

కవి: తిక్కనా! నీయత్నము నాకు జయప్రదమగునట్లు తోచుటలేదు

ఏలయన, నాతడిట్టి దుష్కార్య మొనర్చుటకు సాహసించుట కు మున్ను ముందు వెనుక లరసియే యుండవలయు. ఆతడు తన మిత్రులసాయ మిదివరకే పొందియుండవచ్చును. పద్మ నాయకు డండనున్నాడుగదా? ఇంకెందరతని సత్వరము చేర నున్నారో? అట్టియెడ బరబలంబులస్థితి గనుగొన వేగరుల నంపి నీ వెంచినట్లున్నపుడు దాడి వెడలవచ్చును.

కం॥ తనబలమును బరబలమును
మనమున యోజించి బుద్ధిమంతుడు సమరం
బొనరించుగాని నీ వలె
బొనరించునె రిపునిరసనబుద్ధిని తిక్కా!

ర.తి. నీవు నుడివిన కారణంబంత బలవంతమైనది కాదు. ఏలయన-

మ॥ బవరంబే పురుషార్థమం చెపుడు సంభావించి నెల్లూరు భూ
ధవ సింహుండగు మన్మసిద్ధిపయి గాఢ్రివ్వన్ విజృంభించుయా
దవభూపాధము నుత్తరక్షణమె యుద్ధంబందు మార్కొ కకా
లవిలంబం బొనరింప నీకొనుట మేలా నీకు మంత్రీశ్వరా?

అన్నం: ఆర్యా! మన రణతిక్కన నైజపరాక్రమం బెరిగి మీ రిట్లు తామసించుట తగునా?

ర.తి:

మ॥ అనిదంపూర్వ పరాక్రమక్రమ విశేషాలంక్రియా మాన్య స
న్మనికింబంచిన, నీకు శాత్రవుల సంహారంబు గావించి, యా
లను మర్లించెద బుల్లకిం గొనెద జాలంబేమియున్ లేక యీ
యనుమానం బిది యేల నీకు మనుమన్త్రాగ్రణీశ చూడామణీ!

మాసోదరుడు నుడివినట్లు వైరిబలంబు నాబలంబుకంటె నెక్కు డైన నేమాయె. 'వీరస్య కిం సంఖ్యయా' యనవినరే?

మను: సేనానీ! నీపరాక్రమ మెఱుగక నేనిట్టులూరకుంటెననుకొనకుము.

తే॥గీ॥ ధర్మసంగ్రామమున నిన్ను దాకి గెల్వ
హరునకైనను హరికైన నరిదియంచు
నెరుకగలవాడ నేనైన నితఁడు దుష్టు
డగుట నినుబంపనోడెద నంతె మిత్రి!

ర.తి: రాజా! వాడెట్టి యుద్ధమొనర్చిననేమి? అన్నింటికి సంసిద్ధుడనై వెడలెద. నాకింక ననుజ్ఞనిండు.

ఉ॥ పౌరుషవంతులెల్లర వివాదము దీర్చెడు న్యాయమందిరం
బౌ రణభూమి జేరినపుడచ్చట దైవము ధర్మనేతయై
సారకృపాణ బాణచయ సాక్ష్యములన్విని న్యాయ్యవైఖరిన్
దీరుపుజెప్పు గాన వెనుదీయక పంపుడు నన్ను భూవరా!

అన్నం: దేవా! ఉత్సాహవంతుల గార్యతత్పరుల జేయుటకంటె రాజులకు గర్తవ్యమున్నదా?

మను: మామా! వీరి యుత్సాహంబు, నన్నును, నా మనసొల్లని పని నియ్యకోన జేయుచున్నది.

ఉ॥ ఏ నొకరుండ సంగరమహీస్థలి వైరుల జంచి చెండగా
బూనెదనన్న వల్వదన బోలదటం చిటులీయకొంటి నే
నాని శిఖామణీ! ఇక రణంబున వైరులనోర్చి ప్రాణమున్
మానము నిల్పికొంచు ననమానయశంబు గడించి మించుమా.

ఇక నీవు సమస్తాశ్వికుల గైకొని కాటమరాజును శిక్షించి జయంబు గొనిరమ్ము. నేనును మిత్రావనీశ్వర సాహాయ్యమర్థించి సైన్యంబు సమకూర్చుచుండెద.

ర.తి: మీ ప్రయత్నములు నిరర్థకములగు.

అన్నం: మిత్రా! నారి యిష్టానుసారముగా వారి నాచరింపనిమ్ము.

క.తి: సోదరా! యిక బోయిరమ్ము.

క॥ అమల మనీషులునై వి
క్రమధనులై వాసివన్నెగాంచిరి మన వం
శమువారీవు "నిదంబ్రా
హ్మ్యమిదంక్షాత్రమ్మ"నంగ యశముం గనుమా.

ర.తి: తథాస్తు! అట్లేయగుగాక.

సీ॥ మూర్ధంబునందొక్క మూల గిరీట మిం
కొకమూల గాంగవీచికలు దనర
వదనంబు నందొక్కవంక చిత్రపుండ్రంబు
లొకవంక భూతి భస్త్రికలు మెరయ
వక్షంబునందొక్కప్రక్క శ్రీవత్స మిం
కొకప్రక్క ముక్తకంచుకము లలర
కటితలంబున నొక్క కడను పీతాంబరం
బొక కడ ద్వీరదచర్మికయు వరల
నొక్కచేత శార్ఙ్గ మొక్కచేత త్రిశూల
మొనర భక్తజనుల మనుపుచుండు
హరిహరాధినాథు డాదరంబున నాకు
కలనునందు యశము గొలుపుగాత!

నేనిక బోయివచ్చెదను.

(యవనిక పడును)



# రణతిక్కన



## ద్వితీయాంకము

### = ప్రథమరంగము =

(కాటమరాజు పద్మనాయకు లుపవిష్టులైయుండ తెర లేచును)

కాట: మిత్రా! మనకు శత్రులదాకు కాల మాసన్నమగుకొలది వాన గురియబోవు దినంబున నెండం బోలె, హృదయోద్వేగము మితిమీరుచున్నది.

చం॥ మన మనుకొన్నయట్లు మనుమక్షితినాథుని వాహినీశ్వరుం
డని బొనరించి పుల్లరిని నాలను గైకొన నల్పసేనతో
జనియెడు వా డటంచు మనచారులు దెల్పినవార లింక నే
యనువున వాని గెల్వగ హితాగ్రణి! వీలగునో వచింపుమా!

పద్మ: వచించుట కేమున్నది. రణతిక్కన మన మల్పబల సమేతుల మని స్వల్పసేనతో యుద్ధమొనర్ప బయలుదేరెను. నేడాతనికి విజయంబు దుస్తరంబు. మనము సైనికుల సన్నాహమొనర్చి వేచియుందము. అయిన నొకమాట.

మ॥ కపటోద్యోగమునన్ భవద్రిపుల సంగ్రామంబున న్గెల్తువం
చపవాదంబులు పుట్టియున్న విక నీయాలంబునందేని ని
ష్కపటత్వంబున ధర్మమార్గమున నీ శత్రున్ నిరోధించియా

యపవాదంబుల డిందజేసి సుయశం బార్జింపు మిత్రాగ్రణీ!

కాట: మిత్రమా! చెప్పుడుమాటల విని నీ విట్లు నన్ను శంకింపవచ్చునా? నే నేమైన దుండగమొనర్ప బూనిన నీవు నా యండనుంకువుగదా? ధర్మ పరావతారుడగు పిన్నమనాయకుడు వచ్చుచున్నాడు.

దావా: (ప్రవేశించి) దేవా! పిన్నమ నాయకుడు వచ్చుచున్నాడు.

(పిన్నమనాయకుడు ప్రవేశింప నమస్కరింతురు.)

కాట: భూవరా! ఏలయిట్లు వేగిరపాటున బ్రవేశించితిరి.

పిన్న: కాటమరాజా! నేను నా సేనాపతి బ్రహ్మనదియ్య వచ్చుచుండెనేమో చూచిరమ్మని కొందరి చారులనంప రణతిక్కన వచ్చుచున్నాడని వార్త దెల్పిరి. సింహపురినుండి శీఘ్రముగా గుఱ్ఱములపై వచ్చుచో సగము మందికిపైగా వెనుకబడి పోయిరి. ఇపుడాత డయిదువందల కాహిణీయులతో వచ్చుచున్నాడట: ఎంత యవ్యక్త కార్య మొనర్చుచున్నాడు!

కాట: ఈ యవ్యక్త కార్యము మనకు బూర్ణజయ మీయగలదు.

పిన్న: మిత్రా! మన సైనికులు పదునేనువందలమంది యుండ నాతనికి జయమెక్కడిదికాని, నా కీతని స్వల్పసేనతో బోరి జయించుటాత పౌరుషముగా దోచుట లేదు.

కాట: దానికి మనమేమి సేయగలము. ఈ దినము రణతిక్కనకు మరణము తప్పదు.

పిన్న: మిత్రా! ఆ విషయమే నేను ముచ్చటింప వచ్చితిని.

ఉ॥ పాఱుని నాజిమార్కొనిన బాపము పైకొనునందుగ్రగాన నా
ధీరవతంసుడైన రణతిక్కన నెక్కటి కయ్యమందు నే
బోరనటంచు దెల్పిన బ్రమోదము మీరగ సర్వసైన్య సం
భారయుతుండనై యరిగి భండనభూమిని సాయమిచ్చెదన్.

పద్మ: నా యభిప్రాయము కూడ నంతియే.

కాట: నేను మాత్రమందులకు వలదందునా? అభ్యంతరానిందు. పిన్నమ రాజా! మీరే సర్వసైన్యమునకు సేనానాయకులై నేడు విజయము జేకూర్చుడు.

పిన్న: అటులే యగుగాక. (వినుచు) అదిగో! అశ్వఖుర ఘట్టనధ్వని (చూచుచు) అదిగో! రణతిక్కన యాశ్వికదళము. రండు. వారిని పెదజల్లిపల్లె చెరువులో నడ్డగింతము.

(నిష్క్రమింతురు.)

= ద్వితీయ రంగము =

స్థలకము- పెదజల్లిపల్లె చెరువు యుద్ధభూమి.

(సైనికు లనేకులు నేలగూలియుందురు. రణతిక్కన రక్తసిక్త కృపాణహస్తుండయి ప్రవేశించి)

శా॥ హా హా రావమొనర్చి, వైరు లనిలో నాకట్ట విభ్రాంతిన్మై
నోహో! యాశ్వికులార! భీతిలకుడే నున్నాడ మీ దండ నే
సాహాయ్యం బొనరించువాడ నిక నాశంకా విహీనాత్ములై
బాహాటోపముమీర మార్కొని భవత్ప్రత్యర్థులం గూల్పుడీ!

(పారజూచి) తమశక్తి కొలది బోరాడి వైరుల జక్కాడి, యకటా నా రౌతులు నిశ్శేషముగా హతులైరి. ఆ కాటమరాజ హంతకుడు తనసేనతో నన్నును, నా రౌతులను, విడదీసి యిట్టి చిట్టగావించె. కానిమ్ము. జయాపజయంబులు కావడికుండలు. కీర్తి యొక్కటియే శాశ్వతము. ఇంక నే నొక్కడ వీరల వీల

యిన నంతమందిని యమపురి కంపి వీరస్వర్గము జూఱగొని
యెద.

ఉ॥ ఓరి విరోధులార! సమరోర్విని మామకసాదిబృందముం
గాఁజియవెట్టినంతటనె గర్వమునొందకుఁడుద్ధతారిసం
హారచణుండ సిద్ధయకుమారుడనుంటి నొకొండొకండ రం
డోరి సమిజ్జయంబుగొను డోరి పరాక్రమవంతులైనచోన్!

అరుగో! శత్రుభూపులు వచ్చుచున్నారు. నా యుపాలంభనము
కార్యకారియయ్యె. ఓనృపాలులారా! నాతో బోరవచ్చితిరా?
అట్లైన ముందా కాటమరాజుతో నన్ను బోరి నా కసిదీర్చు
కొనవించు.

పిన్న: (ఖడ్గముల దూరముగావైచి) బ్రాహ్మణోత్తమా! శాంతిజెం
దుడు. శాంతిజెందుడు.

ర.తి:

శా॥ శాంతింజెందుడు శాంతిజెందుడనుచున్ సంగ్రామరంగంబునం
దెంతోక్షాంతి వహించి పల్కెదవుకానీ, సంగరాయత్త దు
ర్దాంత ప్రాభవ భూమిశాహిత జనధ్వాస ప్రమోదాళికిన్
శాంతిజెందుట పౌరుషంబె రిపుశేషంబుండ ధాత్రీశ్వరా!

ఏలమీరు కృపాణముల విసర్జించితిరి? హాని గైకొనుడు.

పిన్న: భూసురాగ్రణీ! మీరు ధర్మసూక్ష్మముల విమర్శింపక మమ్ము
లనిట్లు లెక్కటికయ్యంబునకు జీరవచ్చునా? బ్రాహ్మణోన
హంతవ్య యనునార్యోక్తి విసర్జింతురా?

ఉ॥ ఘోతలమూని పాదజుడు భూసురునెక్కటి ఘోరదాకినన్
బాతకమంధి కుందునని ప్రాజ్ఞపుల్ వచించుచుండగా

బూతవిశిష్ట కొట్టరువు భూమిసురాన్వయవారిరాశిసం
భూతశశాంక! నిన్నెదిరి పోరొనరింపగ మాకుబాడియే?

ర.తి: పిన్నమనాయకుడా! ఏమి విపరీతపు గుశ్శంకలు.

ఉ॥ తెంపెసలార బోరుటకు దీకొనికాలునుదువ్వ నన్ను దో
స్సంపద పెంపుమీరగ, విశంకటవృత్తి రణంబొనర్చి కా
రింపక మీరలక్కట! ధరిత్రిసుపర్వ డవధ్యుడంచు బో
ధింపగనేల? యిట్లు వెనుదీయుట ధర్మమె వీరకర్మమే?

ఈ ధర్మాధర్మ విచక్షణ మీ కేల? రణంబొనర్చి నన్ను గెల్వ
గలిగిన గెల్వుడు.

కాట: మిత్రులారా! ఇతడే మనల బురికొల్పుచో మనకితని దాకిన
బాపమలవడునా? యోజింపుడు.

పిన్న: కాటమరాజా! మిన్నకుండుము. అట్టి యధర్మమున కేనియ్యొ
కొనను.

పద్మ: భూసురవర్యా! నిను బోలు వారల దాకుట మాకు ముమ్మా
టికి దగదు.

ఉ॥ ఎంచగరాని సంగరమహీస్థలులన్మొను విక్రమక్రమా
భ్యంచిత శత్రుసైనిక విహారమునోర్చి జయించి కీర్తినా
ర్జించిన శూరవర్యులకు జెల్లునె భూసురు నిస్సహాయు ని
ర్వంచిత విక్రముని సమరరంగమునం దెదిరించి త్రుంచుటల్?

ర.తి: పద్మనాయకా! నీవును బిన్ననాయునిబోలె ధర్మోపన్యాస మొ
నర్చెదవేల?

ఉ॥ పారుడనైన నేమి యని బాయకపోరగ కాలు దువ్వుచో
నేరనివారిబోలె ధరణీధవులార! యిదేమి చిత్రమో
పోరక ధర్మశాస్త్రముల బోధనసేయ గడంగుచుండిరీ!

వీరుల కేటికయ్య రిపువీరకులప్రతిభావివేచనల్?

మీరు నన్ను బరాభవింపనెంచి యిట్టి పన్నాగము బన్నినట్లున్నది.

పిన్న: ఆర్యా! అదెంతమాత్రము మా అభిప్రాయము గాదు. ధర్మనిబద్ధులమై యధర్మమొనర్పనోడి మేమిట్లాడెదముగాని వేరు గాదు.

పద్మ: అవనీసురాగ్రణీ! అదియే నిక్కువము. ఒకవేళ మేమట్లొనర్ప నెంచినను జగద్విదితమగు మీ పరాక్రమంబును గళంకితము జేయగ మాకు సాధ్యమా? కావున మాయుద్దేశములం గూర్చి భ్రమపడక మా చెప్పినటుల సమరభూమిని వీడి పొండు. మరల సైన్య సమేతముగవచ్చి రణమొనర్చి విజయ మొందగల్గిన నందుడు. అదియే యుభయులకు గర్తవ్యము.

ర.తి: పద్మనాయకా! నీ వెంత నుడివినను నాకీ రణభూమి వదలి నా మృతాశ్వికుల వదలి పందబోలె వెనుక కేగుటకు గాలాడకున్నది. సమరోత్సాహమే గల్గుచున్నదిగాని నిరుత్సాహము గల్గుటలేదు. ఈ యుద్ధమందెద్దియైన సధర్మమున్న నాయది. పాపమలవడిన నాయది. మీరింక భయపడక శస్త్రగ్రహణ మొనర్చి పోరొనర్చి నా కామిత మీడేర్పుడు.

పిన్న: ఆర్యా! మేము మరల శస్త్రముల ధరింపము. మీకు బోరొనర్ప నంత యభిలాష మున్న నిరాయుధుల మగు మాతోడ బోరుడు.

ర.తి: (స్వగ) అక్కటా! ఏమిసేయుదును? వీరినింత బురికొల్పినను ననేమిరాయనుచు ధర్మము ధర్మమని రణవిముఖులైయున్నారు. సరే! కానిమ్ము! (ప్రకా) ఓ ధాత్రీశులారా! మీరు రణమొనర్పకున్న నేనేమి సేయగలను? నిరాయుధులతో

బోరుటధర్మముగదా? మీయిష్టానుసారమే యగుగాక. ఐన

మ॥ రణరంగంబున మేము భూసురునిబోరం బాపమం చాడిరా
రణతిక్కండిదె పోవుచుండె ననుచో రాజన్యులారా! ముదం
బణుమాత్రంబు వహింపకుండు డిదె సైన్యంబొండు గైకొంచుదా
రుణ సంగ్రామమునందు మిమ్ములను సంరోధించి శాసించెదన్

కాట: సరే! చేతనైన నట్లే కానిమ్ము. (నాయకులు కాటమరాజు నిష్క్రమింతురు)

ర.తి: అక్కటా! ఇంక బురాభిముఖుండనై యేగవలయుంగదా? ఎట్లేగుదునో?

మ॥ నడిమై సంగరరంగ మేగి యహిత వ్రాతంబు నామూలముం
గడతేర్తు న్నసులన్నరుల్తునని బింకంబార వాకుచ్చి యి
య్యెడ నత్కార్యము జక్క బెట్టకయె నేనేమోముతో బోయినా
పడతిన్ నా జనయిత్రి నా జనకు నాస్వామి న్విలోకించెదన్?

మీరు నైజపరాక్రమ మెరిగి నన్ను మన్నించిన మన్నింతురుగాక. విక్రమ ధనులును, మాన ప్రాణులును నగు నెల్లూరి సౌరులెట్లు తూలనాడెదరో? ఛీ యిందుల కేల యంగీకరించితిని? ఓ పద్మనాయకా! ఓ పిన్నమనాయకా! ఓ కాటమరాజా! రండు. నేను మిమ్ము నిర్జింపవలయు లేక మీచే రణరంగమున నిహతుడనై వీరస్వర్గమైన నలంకరింప వలయునే గాని యిట్లూరక వెనుక కేగిన పరాభవమును యపకీర్తియు రాదా? (ఆగి) అక్కటా! వారప్పుడే శిబిరముల కేగిరి. కానిమ్ము. ఐన దైనది. కానున్నది కాకమానునా? ఛీ నాకీ భయమేల?

చం॥ అనితరసాధ్య విక్రమ సమంచితుడీ రణతిక్కనార్యు డీ
దినమున నాత్మశాత్రవుల డీకొని తాకున కోర్వలేక త్రా

ననిమొన మానమేది, విడెనంచును జెప్పెడువారు చెప్పినన్
వినియెను వారికైనను వివేకముగల్గదె పేరునిల్వదే?

(నిష్క్రమించును)

= తృతీయ రంగము =

స్థలకము—నెల్లూరుబజారు

(సుబ్బిశెట్టి బట్టలంగడి, పోలిశెట్టి గుగ్గిళ్ళంగడి, రామిశెట్టి సంబారపుటంగడి, బాలామణి పువ్వులంగడి యుండును. మల్లంభట్టు సుబ్బిశెట్టి యంగడికేగి)

మల్లం: సుబ్బిశెట్టీ! నాకొక ధోవ తాగోత్రం ఈయాలి. పల్చటి గుడ్డకావాలి. ఎనిమిదిమూళ్ళు ధోవతుండవలె.

సుబ్బి: సరే యిస్తాగాని మల్లంభట్టూ! మీా బాపన బంటు శౌర్యం యిన్నావా?

మల్లం: ఇప్పుడామాట లెందుకయ్యా! నే నడిగినదిస్తూ.

సుబ్బి: ఇస్తా. ఇస్తా. తనబుట్లందరు చస్తే తానొక్కడు బతికొస్తున్నా డటయ్యా రణతిక్కన.

మల్లం: వానిమాట నా ముందట యెత్తకుము. వాడు మా కులము చెడబుట్టినాడు.

సుబ్బి: నిశ్చయంగా అంతే. ఏ కాలంలోనో బామ్మలు పరుసురాముడు, ద్రోణుడు, అశ్వత్థామ ఉన్నారుకానీ యీా కలికాలం లో వుంటారటయ్యా. కలం పట్టాలె గాని ఖడ్గ మెందుకయ్యా బ్రామ్మడికి?

మల్లం: (స్వగ) ఆహా! ఈ సిద్ధయతిక్కన చర్యలు బ్రాహ్మణులనింక నీ వూరిలో తలయెత్తనీయవుగదా? (ప్రకా) సుబ్బిశెట్టీ! ఈ మాటల కేమిగాని యిస్తావా? లేదా?

సుబ్బి: ఇదిగో తీసుకోవయ్యా. (ఒక గుడ్డలచాపు యిచ్చి) ఇదిగో యీ చాపు చాలామంచిది.

మల్లం: సరే! లెఖ్ఖరాసుకో. (గుడ్డను చూచుచుండును.)



(సుబ్బారెడ్డి యనునొకడు రామిశెట్టి యంగడి కేగి)

సుబ్బా రామిశెట్టీ! నాకు 2 శేర్లు పెసలు, 2 శేర్లు కందిపప్పు ముందియ్యి?

రామి: సుబ్బారెడ్డీ! పాపము. నీ కుమాళ్లిద్దరూ పెదజల్లిపల్లె యుద్ధంలో చచ్చారటగా. పాపం.

సుబ్బా: పాపమేమయ్యా! వాళ్ళు శక్తికొద్దీ పోరాడి తల్లిదండ్రుల ఋణము, రాజఋణము, దేశమాత ఋణము దీర్చి వీరస్వర్గమలంకరించారు. వారు చచ్చినందుకు నేను దిగులొందను గాని యటువంటి వీరులు ఇంకిద్దరు లేరని చింతిస్తున్నా. ఉంటేనా? మళ్ళీ యీసారి యుద్ధమునకు పంపియుండే వాడిని.

రామి: సుబ్బారెడ్డీ! నీబోటి తండ్రులున్నందు వలననే అట్టి కొడుకులు గలిగారు. అయితే ఖడ్గతిక్కన పారిపోయివచ్చింది నిజమేనా?

సుబ్బా: నిజం గాకపోతే యిట్టివి యబద్ధాలు పుడ్తాయా? పాపమా సిద్ధసమంత్రి నేడు వృద్ధాప్యములో తలవంచుకో వలసి వచ్చింది. సింహాంకడుపున జింకపిల్ల పుట్టింది.

రామి: అవును. అతనికంటే నీకే ఘనతయెక్కువ, సేనలో బాపనోరికి ఉద్యోగం యెందుకంట. బాపనపోటు కప్పకాటు వుండదని

చాటువు లేదూ?

సుబ్బా: రామిశెట్టీ! నాకు సామాగ్రి యిచ్చి పంపుము. నే వెళ్ళాలె త్వరగా. (ఇచ్చుచుండును)

♦ ♦ ♦ ♦

(కొమ్మన్న యను బ్రాహ్మణసైనికోద్యోగి ప్రవేశించును. పుష్పలావికయగు బాలామణి పూల బుట్టలో దర్భలుంచి గుడ్డమూసి యుంచును)

కొమ్మ: బాలామణీ! నేడేమి పూలబంతుల గుడ్డలో దాచి యుంచితివి?

బాలా: పూలబంతులు వస్త్రములో దాచకుంటే వాడిపోవా?

కొమ్మ: సరే నాకు రెండు పూలబంతులిమ్ము.

బాలా: రెండుచేతులకు రెండా?

కొమ్మ: అవును. (బాలామణి బుట్టలో చేయిపెట్టి) వెలయెంత?

బాలా: నేడు బంతుల ధనమున కీయను.

కొమ్మ: ఏల? వేడుకకు వెలలేదనియా?

బాలా: ఎట్లైన నను కొమ్ము. నా కోరినదిచ్చినగాని యియ్యను.

కొమ్మ: నీకేమి కావలయు? నా కంఠమా?

బాలా: కాదు. ఖడ్గము.

కొమ్మ: అదినీకేల? ఈ విపరీతపు కోర్కె యేమి?

బాలా: కుశబట్టువారు ఖడ్గముబట్ట కుసుమముల బట్టువారు దాని ముట్టగూడదా?

కొమ్మ: నీ నెరజాణతనము కట్టిపెట్టి నాకు పూబంతులనిమ్ము.

బాలా: ఇదిగో! నాదండ పూబంతులు లేవుగాని, యింకొకటిచ్చెద. గ్రహింపుము.

కొమ్మ: పూబంతికంటె శ్రేష్ఠమైనదా?

బాలా: మీ కట్టిదే? ఇదిగో! (కుశనుదీసి చేతికిచ్చును)

కొమ్మ: ఛీ! ధూర్తురాలా! (అని నిష్క్రమించును.)

బాలా: రణతిక్కనను రానిమ్ము. అతనికీ కుశనీయకున్న నే నాడుదా ననేనా? (చూచి) అదుగో రణతిక్కన వస్తున్నాడు. (కేకలు వేయును. రణతిక్కన ప్రవేశించును)

ర.తి: పినాకినీ నదినిదాటితిని. హరిహరనాథుల దర్శించితి. అంగడి వీధి బ్రవేశించితి. ఆహా! ఏమీ! యీ పట్టణముపూర్వోన్న మే యైనను నడిరేయిబోలె మాటుమణిగియున్నది. ఈ విప రీతమునకు గారణ మేమైయుండును.

చం॥ అనుదినమేను వీధుల విహారమొనర్చుచు నుండువేళ నన్
గనుగొని దీవనల్ సలుపు బ్రాహ్మసురులేరి? నివాళులిచ్చున
బ్జనయనలేరి? దండములసల్పెడు సేవకులేరి? మాయమై
చనినటులుండె రీయెడల జానపదంబుల కేమిమూడెనో?

(సుంతయోజించి) చెడ్డవార్తలు చెచ్చెర జేరునన్నట్లు నా సైన్య ధ్వంసవార్త యీ పురి చేరియుండునా? (వెనుకనుండి "వస్తు న్నాడోయ్ మగధీరుడు" అని కేకలు. వెనుకకుదిరిగిచూడ "ఇదిగో ఆ ఖడ్గమిచ్చి యీ కుశదీసికో" అని కేకలు. ముందు నకుజూడ "రణతిక్కన కుశతిక్కనయైవాడోయ్" అని కేకలు కుశలు, తడిబియ్యముపైన చల్లబడును. రణతిక్కన కోపఘూ ర్ణిత నేత్రుడై)

శా॥ నానా ఘోరరణాంగణప్రతిముఖోన్మత్తారిరాజన్య సే
నాని వ్రాతమదాప హర్తనగు నన్నా? నేడు, నెల్లూరి పౌ
రానీకంబిటు కాందిశీకునిగ, వీరాగ్రేసరమ్మన్యుగా
బ్రాణత్రాణపరాయణాత్మునిగ, నుత్ప్రాసించి భాషించుటల్!

కానిమ్ము.

మ॥ అరరే మస్మన్నృపాల జానపదులారా! మీరలజ్ఞాన సం
భరితాలాపులటంచు మిమ్ములను గావంజొచ్చితింగాని, న
న్నరిరాజన్య మదాభిమాన హరణ వ్యాపారపారంగతున్
బెరవారిట్లు దురూక్తులాడ భువి జీవింపంగ నే నోర్తునే?

(ముందునకేగి) అక్కటా! నే ననుకొనినట్లే యైనది.

మ॥ వికలప్రజ్ఞులమాడ్కి శాత్రవులు దోర్వీర్యంబు పెంపేది, ఘో
రక, భూదేవు డవధ్యుడంచనిన గార్యజ్ఞానశూన్యుండనై
యకటా! యూరికి గ్రమ్మరిల్లగనె పౌరానీక మిప్పట్టునన్
వికటార్థంబు లొనర్చి నా నడవడిం గీరింప నుంకించిరే?

అక్కటా! అందరునిట్లే యొనర్తురా? ఛీ! ఛీ!

ఉ॥ ఈజడు లేమియుం దెలియ కిట్టులు వాకొనినంతమాత్ర నా
కీజడు పేల? వేగముగనింటికి బోయెదువాడ నచ్చటన్
నాజనకుండు నాజనని నా సహధర్మిణి నాసుతుండు నా
నైజపరాక్రమం బెరిగి నన్ను చిత్రక్రియ బల్కకుందురే?

చూచెదగాక. ఇక గృహాభిముఖుడనయ్యెద.

(నిష్క్రమించును.)

= తృతీయ రంగము =

(రణతిక్కన నిష్క్రమింప నాతని సుతుండు తిక్కనవచ్చి)

చిన.తి: ఆహా! నేడు నా మిత్రులచర్య కడువింతగా నున్నది. దిన దినము ప్రాతఃకాలమైనంతనే నాతో నాటాడ వచ్చువారు. నే డేలకో యొక్కడును రారైరి. ఈ మార్గమున బోవుచుండ నేనెంతపిలిచినను వినుపించుకొనకయే పోవుచున్నారు. ఈ సారి యెవ్వరీమార్గమున బోవుదురో వారినడ్డగించి బంధించి తెచ్చి కారణ మడిగి తెలిసి కొనియెద. (దూరమున మంచన ప్రవేశించును) అడిగో మంచన. వానిని బిలిచెద.

(పిలుచును)

మంచ: ఆహా! తిక్కన నన్నుజూచె. ఇకేమి చేయుదును?

(పరువెత్తుచో చినతిక్కన పరువెత్తి పట్టి తోడి తెచ్చును)

చి.తి: మంచనా? నేడేల నాటలాడరాలేదు? మరియు నన్నుజూచి పరుగెత్తితివేల?

మంచ: కార్యార్థినై పోవుచుంటిని.

చి.తి: కార్యమవల చక్కబెట్టవచ్చును. రమ్ము. మనము వ్యూహక్రీడ నాడుదము. నీ జట్టిని నీవు తెచ్చుకొనుము. ఏమట్లు సంశ యించుచున్నావు? నేనొక్కడ మీకు జాలననియా? ఖడ్గ తిక్కన సుతుని విషయమున నట్లు సంశయింపకుము.

మంచ: నాకు సంశయమునకు గారణ మది కాదు.

చి.తి: మరేమి? త్వరగా దెల్పుము.

మంచ: మనమిత్రులెవ్వరును నీతో నాడుటకు రాకున్నారు. మా వాండ్రను నా కట్లే బోధించినారు.

చి.తి: ఇట్టి విపరీతబోధనకు గారణమేమి?

మంచ: నీ కింకను దెలియదా?

చి.తి: తెలిసిన నిన్నడుగుదునా? నాయందు దయయుంచి తెల్పుము.

మంచ: మేము పిరికిపంద యాత్మజునితో నాటలాడుట పరువునకు లోపమనిరి.

చి.తి: నేను పిరికిపంద కుమారుడనా?

శా॥ ఏమేమీ! సకలాహవ ప్రతిముఖోర్వీశానకంఠీర వో
ద్దామ ప్రాభవ భంజనుండయిన నాతండ్రిన్ మదోన్మత్తులై
యీ మార్గంబున బందయంచనిన వారేరో యెరింగింపుమీ
భీమ ప్రక్రియ వారినాలుకల సంభేదింతు నిప్పట్టునన్.

ఓరీ! మూర్ఖుడా! నాతండ్రి పిరికిపందయా? అతని శౌర్యపరాక్రమంబులు జగద్విదితములుకావో? అతని బోర గెల్వమానవుల కసాధ్యమని మీరే యనుటలేదా? అతడు హరిహరనాథ వరప్రసాదియని మరచితిరా?

మంచ: నిజమాడిన నిష్ఠురము సహజమేకదా?

చి.తి॥ మూర్ఖా! నీవును నా దూరును నమ్మెదవా?

మంచ: తిక్కనా! నమ్మకేమి సేయుదును? మీతండ్రి మొన్న పెదజల్లిపల్లెలో సైనికులందరు చావ తా బోరి వారి పగసాధింపక తా నాడిన ప్రతినజెల్లింపక మరలి వచ్చుచున్నాడట.

చి.తి: ఛీ! ఛీ! ఆ మానధనుడేమి యిట్లొనర్చుటేమి?

మ॥ ప్రకటారాతి మదాభిమానహరణ వ్యాపార పారీణుడై
కకుబంతంబులు పేరుమ్రోయ రణతిక్కం డేమి? యుద్ధస్థలిన్
వికల ప్రజ్ఞుడుబోలె వైరులకు వెన్నొసగి యేతెంచుటే
మకటా! యియ్యది సత్యమంచును సఖా! ఆలోచనల్ సేయవే.

మంచ: మిత్రా! దైవానుగ్రహమున నియ్యది యసత్యమే యగుగాక. మా పెద్దవారు నుడివినదిది. ఆ బాలగోపాల మనుకొనున దిది యు. దీనియధార్థము మీ తాతగారినడుగుము. అన్ని సందియ ములు తీరును.

చి.తి: అట్లేయొనర్చెద. అత డబద్ధ మనును. తర్వాత నీ పల్లెనుల పని బట్టించెద. తాతగారూ, తాతగారూ! (ఇంటిలోని కేగును)

సిద్ధన్న: (ఎదురుగావచ్చి) ఏమి నాయనా! ఏమీ నీ మొగమున నేడు కోపతాపాశ్చర్యమ్ములు ముప్పిరిగొనియున్నవి. కారణమేమి?

చి.తి: కారణమును నే నేమని నుడువుదును.

మత్తకోకిల॥ ఎందుజొచ్చిన నీ ధరాస్థలి నీకులేని మహాబలా
రిందముండని యెల్లవారు స్మరించుచుండగ మేటికీ
ర్తిం దనర్చెదు నాదుతండ్రిని తెల్పి మాలినవారలై
పందగా వచియింతు రీ పురివార లియ్యది సత్యమే?

సిద్ధ: నాయనా! అట్లే నిందాలాపము లాడుచున్నారు. దీన గల యధార్థము నీ తండ్రి వచ్చినగాని తెలియదు.

చి.తి: తాతగారూ! నిక్కువ మొకింతయైన లేనిదే యిట్టి యపనింద పుట్టునా?

సిద్ధ: నాయనా! ఈ విషయము బాలకుడవగు నీ కేల? నే విచారించె దలెమ్ము.

చి.తి: తాతగారూ! మీరుగూడ నట్లనదగునా? బాలురపై లేనిభార మొందుకలదా?

తే॥గీ॥ పెద్దవారలు కార్యం బుపేక్ష సేయ
మగటిమిని మించి మానాభిమానములను
బెంచి కీర్తివల్లిక నభివృద్ధిసేయు
భార మంతయు బాలురపైన లేదె?

పెద్దవార లవమాన కరంబగు కృత్యము లొనర్చుచో పిన్న
వారికి మాత్రము పేరు నిల్చునా? మరియు మా కాదర్శ
ప్రాయులుగా నుండువారి చరిత్రము నిష్కళంకముగా నుండ
వలదా?

సిద్ధ: నాయనా! త్వరపడకుము. నీతండ్రి త్వరలో రాగలడు. తదనం
తరమంతయు నిక్కమముగా విశదము కాగలదు.

చి.తి: విశద మగుట కేమున్నది? ఆలను, పుల్లరిని గొనిరాక వచ్చిన
నేమిలాభము? అక్కటా! తండ్రుల దుశ్చేష్టితములు తనయు
లను దాకునంట నేడు నిజమయ్యె.

సిద్ధ: నాయనా! దుఃఖించకుము. నేను దీనికి దగిన కర్తవ్య మాలో
చించెద.

చి.తి: తాతగారూ! నే నింకబోయెద. మాతండ్రిగారితో దాను ప్రతి
జ్ఞాపాలనమునం దుదాసీనుడై యుండుదనుక నాతని మొగ
మేను జూడనని నావాక్యముగా దెల్పుడు. (నిష్క్రమించును)

సిద్ధ: అక్కటా! నాకుమారునిమౌఢ్య మెందరకు దుఃఖకారణమైనది!

కం॥ ఒక్కరుడు తప్పుచేసిన
బెక్కండ్రిట బాధపడిరి పెడవిధి విధిచే;
బెక్కుఘటంబుల యావా
బొక్కటియే గ్రచ్చకాయయుండిన జెడదే?

అయిన నా కుమారుడు వచ్చినపిదప విచారించెదను.

(తెరపడును)

= పంచమ రంగము =

స్థలకము– సిద్ధన గృహము

(సిద్ధనస్నానమొనర్చి విభూతిధరించి, సుందరాకాండ పారాయణమొనర్చుచు, కొంతసేపటికా గ్రంథపఠనంబు వదలి)

సిద్ధ: అక్కటా! ప్రాతఃకాలమున నా పిట్టపిడుగువార్త విన్నప్పటి నుండియు నామనంబెంతయు దామరపాకుపై జలంబుబోలె నుర్రిటలూగుచున్నది. సుందరాకాండ పారాయణమునకు గూడ నంతరాయ మొనర్చుచున్నది. అక్కటా! నాపేరు నానంశముపేరు దిగంతముల వ్యాపింపజేయునని యువ్విళ్ళూరుచున్న నా తిక్కనయే తుట్టతుదకు పందవలె జరించి, తులలేని దుఃఖము తెచ్చిపెట్టె. ఏది సుఖప్రదమో అదియే యసుఖప్రదముగదా. ఛీ! ఛీ! ఇంకను వాడు నాకొడుకగునా? మానము బోవిడిచిననాడే అతడు నాకు మృతినందిన ట్లాయె.

ఆ॥వె॥ ఈ దినంబుదాక నేడ్గురు పుత్రులు
గలరటంచు నాకు నలరుచుంటి
నది యసత్యమింక నార్గురు పుత్రులే
గలరు తిక్కడాజి గలతజెంద.

వానిని రానిమ్ము. నా యభిప్రాయంబును మనుమని సందేశమును దెల్పెద. ( మరల బారాయణ మొనర్చుచుండ రణతిక్కన ప్రవేశించుచు )

ర.తి: (దూరమున బ్రవేశించి) ఈ నెల్లూరి పౌరుల న్యాయాన్యాయ విచక్షణ యెట్టులున్నను, పౌరుషమున్మాత్రము ప్రశంసనీయముకదా?

చ॥ అనుపమ విక్రమక్రమస మంచితకీర్తిని నన్నె వైరులా
జినిబొనరింపమన్న ననిసే యకవచ్చిన నన్నె యిట్టు లీ
జనములు లెక్కసేయ కెకసక్కెములాడ దొడంగిరౌర! యే
యనువున వీరు, నిక్కపు రణాంగణభీరువుల న్నసింతురో?

త్వరలో వీరి పొగడ్తల కర్హుడ నగుదుగాక. అదిగో మాగృహము. (నడచి) అదిగో మాతండ్రిగా రెప్పటియట్లు సుందరాకాండ పారాయణ మొనర్చుచున్నారు. వారికి నమస్కరించి లోనికేగెదగాక. (డాసి) తండ్రీ! తమ జ్యేష్ఠసుతుండు తిక్కన నమస్కరించుచున్నాడు.

సిద్ధ: ఛీఛీ! నా జ్యేష్ఠసుతుండు చచ్చినాడు. నీవెవడవో?

ర.తి: తండ్రీ! ఇదేమి విపరీతపు పల్కులు?

సిద్ధ: ఇందు విపరీత మేమున్నది?

మ॥ కితవా! మానముపీడి ప్రాణమును రక్షింపంగ నేనాడు యు
ద్ధతలంబందున నుండి శాత్రవుల విధ్వంసంబు గావింప కా
శ్రితులన్ వైరులవాతబెట్టి చనగా సిగ్గొంద వానాడె నా
సుతుండొక్కండు గతించె నాకిక దనూజుండీవు గావేసుమా!

ర.తి: తండ్రీ! తండ్రీ! మీరును నీ ముక్కిడి జనంబులబోలె నీ పుక్కిటి వార్తలవిని నన్నుంగూర్చి యిట్లాడదగునా? నేను మానము మంటగలిపి ప్రాణములు తీపని పరుగెత్తి వచ్చువాడనా?

సిద్ధ: అది నిజమయిన నీ విట్లేల వచ్చితివి?

ర.తి: అట్లడిగి నాయందు దప్పున్న శిక్షింపుడు.

ఉ॥ పారుడవీవుగాన నిను బైకొని పోరిన బాపమంచు బ
ల్మారులువల్కి శస్త్రములు మానిన వైరినృపాలకోటితో

బోరు టసాధ్యమంచు దలపోయుచు గొండొకసారి సైన్యసం
భారసమాశ్రితుండనయి ఖండనమున్బొనరింప వచ్చితిన్.

సిద్ధ: మూర్ఖా! ఈధర్మసంశయము వారు నిన్ను పౌరుషవంతులలో బరాభవింప బన్నినపన్నాగమని గుర్తెరుంగ లేకపోయితివా? వారట్లన్నంత నీవు వెనుకకు రాదగునా? మాన మొక్కసారి పోయినజాలదా? ప్రాణముపై నంత యాసయేల?

శా॥ ఏ కాలంబున నే ప్రదేశమున నే యే రీతులం జావుమా
చాకంజాసను డెల్ల ప్రాణులకు జన్మాది న్నియోగించెనో
యాకాలంబున నాప్రదేశమున నాయారీతులం జత్తురీ
వీక న్గొంకితివేల కర్జమును గావింపంగ నో బాలిశా!

ర.తి: తండ్రీ! నేను వైరులు యుద్ధమాడనన్న వారియుపాలంభన మొనర్చియు నిష్ఫలమైన జేయుఁదిలేక వచ్చితిని. దానికి మీరిట్లు తూలనాడనగునా?

సిద్ధ: ఛీ! ఛీ! నాతో మాటాడక వెడలిపొమ్ము.

ర.తి: అట్లు నిపుడడిదియే కర్తవ్యము. మీరు కొంతశాంతచిత్తులైన పిదప నేనొనర్చినది ధర్మమని నిరూపించెద.

సిద్ధ: అదెన్నటికేని గుస్సాధము. వేగము వెడలిపొమ్ము. (రణతిక్కన నిష్క్రమించును)
తిక్కనవలన యథార్థమువినినంత నాకు వానిచర్య యంత దూష్యముగా దోచుటలేదు. అయిన నాకింతకంటె గర్తవ్య మున్నదా?

మ॥ తనపేరున్, దనయింటిపేరు, దనసంస్థానంబు పేరున్ బ్రవృ
ద్ధిని గావించెడు నట్టిమార్గమున వర్తింపంగ వెన్దీయుచో
జనకుండున్ జనయిత్రియుం బడతియుర్ సద్బోధగావింపబూ

నినచో బూరుషు డున్నతిం గనునె బాంధవ్యంబు పెంపొందునే? నేనును లోనికేగెద.

(నిష్క్రమించును)

= షష్ఠ రంగము =

(స్థలకము- సిద్ధనగృహము.)

(జానాంబ నులకమంచముచాటుపెట్టి దానిపై పసుపుముద్ద యొకటి యుంచి కాగులో నీళ్ళతోడి పెట్టి బయటికివచ్చి)

జానా: ప్రాణేశ్వరుండింకను రాడయ్యె. తానొనర్చిన పందకార్యంబునకు బశ్చాత్తాపపడి నన్నుజూడ మోమోడి యిట్లాలసించుచున్నాడేమో? అక్కటా!

తే॥గీ॥ "బాసలను మాతృమే పస బాపల"కను
నపయశమ్మును హరియింప నవతరించె
నాదు హృదయేశ్వరుండని నమ్మినట్టి
యాసలన్నియు నేడడియాసలయ్యె.

ఇట్లొనర్పినందుల కాతఁ కుచితరీతి నా యభిప్రాయ మెరిగింపకుంట దగునా?

(రణతిక్కన సత్వరముగ ప్రవేశించి)

ర.తి: కల్యాణీ! నీరంబుల సిద్ధంబు చేసితివా?

జానా: అట్లే యొనర్చితి.

ర.తి: ఏదీ? ఎక్కడ? (నలువైపులజూచి)

జానా: (మంచమువైపు జూపి) ఇదిగో! ఈ మంచము చాటున.

ర.తి: బేలా! ఈ మంచము చాటేల? ఈ సన్నాహ మంతయు నేల? అక్కటా! నేడు మీ రందరు నన్ను బరాభవింప గంకణము గట్టుకొని నట్లున్న దే?

జా నా:

కం॥ పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెందున్?
ముగురాడు వార మైతిమి
వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్?

ర.తి: బేలా! నీ యజ్ఞానంబునకు దుఃఖించుటకుగాని, నీ పౌరుషంబునకు ప్రమోదించుటకుగాని, నాకు తోచుట లేదు. నీవిన్ని యేండ్లు నాకర్ధాంగి వై సహధర్మచారిణి వై నా నైజంబు నెరుంగకిట్లాడదగునా?

ఉ॥ భూసురవర్యు నిన్నెదిరి పోరిన మాకఘమంచు బాణబా
ణాసనముల్ త్యజించి సమరావని నిల్చినవారి బోరగా
నీ సమయంబుగాదని గ్రహించి పునఃప్రుతనా వృతుండనై
గాసిల జేతు వైరినని క్రమ్మరివచ్చుట వెన్నుజూపుటే?

జా నా: కారణ మెట్టి దైన నేమి? తోడిబలంబులు విరుగ మీరు నాడు రాజసభలో నాడినమాట దక్కించుకొనక యొంటరి సుక్షేమముగా వచ్చుట బాగా?

ఉ॥ మానముతోడ ప్రాణముసమానముగాదని మాన్యులాడుచో
ప్రాణము పెద్ద జేసి యిటు భండనభూమిని వీడి వచ్చినన్
మానధనాఢ్యులెల్ల రవమాన మొనర్పక యుండరంచు మీ
మానసమందొకింతయు విమర్శన జేయక రాగ జెల్లునే?

ర.తి: గోలా! ఇంకను నీయభిప్రాయమును దిద్దుకొనవా? వైరులు యుద్ధమొనర్పమనిన యేమి సేయుమనియెదవు? ఆత్మహత్య గావించుకొను మనియెదవా?

జానా: అభిమానధనులు ప్రతిజ్ఞాభంగంబుపట్ల నట్టే యొనర్తురు. అందులకు సందియమేల?

ర.తి: భళీ! అభిమానధనుల చర్యలు నీవు బాగుగ నెరిగినదానవు. ఆత్మహత్య యధఃపతన హేతువుగదా? ఇకనీతో మాటాడిన బ్రయోజనముండదు. నూతికడ కేగి స్నానమొనర్చి భోజన గృహంబుకేగెద. (నిష్క్రమింప, జానాంబ ముందునకువచ్చి)

జానా: ఆహా! నా మాటలకు గినిసి నన్ను వీడిపోయె. కానిమ్ము. ఇట్టితరి నిట్లుమెలగకున్న నా సహధర్మిణీత్వంబునకు గళంకము రాకుండునా? ఇట్టిపట్ల స్త్రీలకిట్టి చర్యయే గ్రాహ్యము గదా? సోదరీమణులారా?

శా॥ పాతివ్రత్యము భంగమౌననుచు సంభావించి, యాత్మేశ్వరుల్
నీతిన్ ఖ్యాతిని నీటిలోగలుప దూష్ణీంభావముం బూనక
జ్ఞాతాస్యల్ భవదీయనాథులకు దాసంబేది ధర్మజ్ఞని
ర్ణీతాధ్వంబున సంచరింప యశమార్జింపం బ్రబోధింపుడీ!

మరియు బతివ్రతులగు నిల్లాండ్రు తమపిల్లలయెడ దమధర్మంబు నిర్వర్తింపకున్న దమ పిల్లలయెడ దమ వంశమునెడ దమ దేశమునెడ బాతకమొనర్చిన వారగుదురు.

చ॥ ఎరుక యొకింతలేక జనియించినదాదిగ దల్లిదండ్రులే
పిరికితనంబు నూరి తమపిల్లలకెల్లర కుగ్గుపాలతో
గరపగ బూనుచుండు నెడ గార్యముపట్ల మరేవిధంబుగా
బిరికితనంబుగాక, పెనువీర్యము వారలకున్ లభించునో?

కావున మగవారు భీరులగుట, వీరు లగుటయు మన యత్న ములనున్నది. దానిని విస్మరింపక యాచరించిన మానినీ నామంబు సార్థకంబగు.

కం॥ భీరుశిఖామణి నేనియు
వీరశిఖామణిగ జేయ వీలగు మనకం
చారసి మీమీపతుల గు
మారుల సోదరుల నట్లు మార్పుడువిదల్!

ఇక నేను భోజనగృహమున కేగెద. అక్కట! వీరపత్నియు వీరరమణియునగు మా యత్తగారు పోలాంబ తన తనయుని వర్తన నేవిధముగా నధిక్షేపించునో?

(నిష్క్రమించును)

= సప్తమ రంగము =

స్థలకము— భోజనగృహము

(రణతిక్కన భోజన మొనర్చుచుండును. తల్లియొకప్రక్కను భార్య మరియొకప్రక్కను నిలిచియుందురు.)

ర.తి: తల్లీ! పెరుగు వడ్డింపుము.

(పోలాంబ లోనికేగి విరిగినపాలు నొకముంతలో దెచ్చి విస్తరిలో బోయును.)

ర.తి: తల్లీ! పాలేమి విరిగినవి?

పోలాంబ: నాయనా! అందు వింతయేమి?

కం॥ అసదృశముగ నరివీరుల
బసమీరగ గెలువలేక పందక్రియ న్నీ
వసివైచి విరిగివచ్చిన
బసులున్విరిగినవి తిక్క! పాలు న్విరిగెన్.

ర.తి: తల్లీ! నీవుగూడనా? (అన్నమువదలి లేచి)

చ॥ తనయుల నైజవర్తనలు తల్లులకెల్లెడ దెల్లమంచు, నా
జనకుడు దూలనాడిన బ్రిజల్ దెగనాడిన, భార్య దూరినన్
జననిరో! నీవుమాత్రము నిజంబు గనుంగొని నెమ్మి నీ తనూ
జుని గొనియాడకుండ వనుచుం దలపోసితినమ్మ గ్రుడ్డినై.

మ॥ జననంబొందితి వీర కొట్టరువు వంశంబునన్, సంగ్రామ వి
ద్యను వల్లించితి వైరి మారణచణ వ్యాపారపారీణ సి
ద్ధన సేనాపతి సన్నిధానమున మాతా! యట్టిచో బందనై
యనిలో మానము వీడి వచ్చెదనొకో! ప్రాణావనోత్సాహినై.

పోలాంబ: నాయనా! స్వప్రతిజ్ఞానుసారంబుగ నరుల గెల్వక, పుల్లరి గైకొనక, నాలను మరలింపక వచ్చుట మానభంగ హేతువుగాదా?

కం॥ ప్రాణమ్ము మనకు దైవా
ధీనం బైయుండుగాని దేవుని కృపచే
మానముమాత్రము మన స్వా
ధీనమ్మైయుండునంచు దెలియవె పుత్రా!

ర.తి: తల్లీ! నీ కేమని ప్రత్యుత్తర మీయగలను?

ఉ॥ ఇంతటిమాత్ర కార్యమున కీరలునెల్లరు నన్ను బందగా
జింతసేసి, యిట్లుపహాసించి కలంపగ బూనినారలో

క్కింత యథార్థముం గనిన నిట్లొనరింతురె? యైన దైనదిం
కింతటినుండి యింపు జనియింపగ జేసెదమీకు దల్లిరో!

(సిద్ధన చినతిక్కనతో ప్రవేశించును) అయిన నాతప్పు నే
జూచాయగా గ్రహించితి. ఇక గర్తవ్యమొనర్చెద. భయ
పడకుడు.

మ॥ వినుడీ నాను ప్రతిజ్ఞ మీకు హృదయోద్వేగంబుపోనాడియో
జననీ! యోషిత! యోసతీ! యిదె చమూసన్నాహసంరంభినై
చని, విద్వేషుల జుట్టుముట్టి విజయస్తంభంబు నాటింపగా
నను వైనం జనుదెంతు లేనియెడ నాయాస న్విసర్జింపుడీ!

సిద్ధ: భళీ! ఇపుడు నీవు నా కుమారునివలె బలుకుచున్నావు.

ర.తి: తల్లిదండ్రులారా! నేనీ క్షణంబు యుద్ధభూమికేగెద. నాకు
విజయంబుగలుగ నన్నాశీర్వదింపుడు.

సిద్ధ: నాయనా! నర్వేనల్లెమిట్టను మన నృపాలుడు పితభూపతతులం
గూడి విడిసియున్నాడు. నీ పరాజయవార్త విన్న యుద్ధంబు
నకు గడంగు. అందేగి మరల నీ వైరులదాకి విజయ మం
దుము.

చం॥ అసదృశ విక్రమక్రముల నాహవముం దెదిరించునప్పుడే
పసగలవీరుడైన దన ప్రాణము లిచ్చుటకంటె నెక్కుడే
మెసగగలాడు గాన సమరోర్విని గెల్పును గాంచియుంతె నీ
యసులనిచ్చియుండె భవదన్వయకీర్తిని నిల్పబెట్టుమా.

ప్రోలాం: (తిక్కననుడాసి) నాయనా! నీకు దైవంబు సర్వవిధముల
నేడు దోడ్పడుగాక. మన యిలవేల్పుడగు హరిహరనాథుండు
నిన్ను రక్షించుగాక.

ఉ॥ ఎన్నటికేని మర్త్యునకు మృత్యువు తప్పదుగాన మర్త్యు డం

బన్నవిధాన పారక స్వబంధు స్వదేశస్వరాజ్య రక్షణం
బున్నెలకొల్పగా సమర భూమిని జచ్చుటకంటె మేటిచా
వెన్నగ నీ ధరిత్రిగలదే సుకుమార! కుమార! తిక్కనా?

జా నా: (తిక్కన ఖడ్గము తెచ్చి చేతికిచ్చి మోకరించి నమస్కరించి)

చ॥ అహితుల బోరనోరిచి జయంబును గొంటిరయేని నన్ను మీ
సహచరి గూడరం డటుల సాగక మీరలె పోరగూలినన్
సహగమనంబొనర్చి తమసన్నిధి కేజనుదెంచుదాన నా
కిహ పరసీమలందు హృదయేశ్వర! తారక మీరలేకదా.

చి.తి: (నమస్కరించి) జనకా! తాతగారివలన నా సందేశమాలకించి తిరిగదా.

ర.తి: (తన కుమారుని దగ్గరదీసి ముద్దాడి) నాయనా! తీ ప్రతిజ్ఞా వచనంబులెల్ల నా కవగతమయ్యె. ఈ వయస్సునకే యింత పౌరుషము నీ కలవడుట మా పూర్వపుణ్య ఫలంబగు. ఆజన్మాంతము నిట్టి పౌరుషమునే వెలిబుచ్చి మావంశమునకు వాసియును, వన్నెయుదే నీకు హరిహరనాథుడు తోడ్పడు గాక. ఇక నేనేగెద. నాకై దుఃఖింపకుము. శూరుని బంధువులకు సుఖమెప్పటికిలేదు.

చ॥ అరులను గెల్వజాలిన రయంబున వచ్చెద గెల్వలేనిచో
మరణముగాంతు నెట్లయిన మానధనాఢ్యుల నీహుతండ్రికై
శిరమునునెత్తి నీవు హరుసింపగ జాలుదు వింకపై జరా
భరులగు వీరి భక్తిని నిరంతర సేవల దన్పుచుండుమా!

చి.తి: తండ్రీ! అట్టేయొనర్చెదను. మీ పూతచరిత్రమే మాబోంట్లకు మార్గదర్శకమగుగాక.

కం॥ తన విశ్రుత చరితముచే
దనవారలకెల్ల మార్గదర్శివి యగు నీ
తనయుండగు ననుగూరిచి
యనుమానింపకుడు పెంతు నన్వయకీర్తిన్.

తి: (ముద్దాడి) నాయనా! అట్లొనర్ప దైవము నీకు తోడ్పడు గాక. తలిదండ్రులారా! ప్రేయసీ! మీ యిష్టానుసార మొనర్చెద. ఇక నాకు సెలవా?

ఉ॥ మానముతోడ ప్రాణము సమానము గాదని సంతతంబు స
న్మానధనాగ్రిగణ్యులకె, మానసబోధ మొనర్చుచుందు, నీ
మానవకోటి కార్యనుత! మందిరమై తగు సింహపట్టణం
బానలినాప్తతారముగ నట్టులె భాసిలుగాత ముర్విపై!

(తలిదండ్రులకు నమస్కరించి, సతీసుతులు నమస్కరింప నాశీర్వదించి రణతిక్కన నిష్క్రమించును)

సిద్ధ: ఇంతులారా! నాయనా! మనము హరిహరనాథాలయమున కేగి మన తిక్కనకు మన మనుమసిద్ధి నృపాలునకు విజయ మొసంగ ప్రార్థింతము రండు.

(అందరు నిష్క్రమింతురు)



# రణతిక్కన



## తృతీయాంకము

= ప్రథమ రంగము =

స్థలకము—పాకనాటి యొడ్డున నుండు పంచలింగాలకోన.

(మనుమసిద్ధియు, నన్నంభట్టును నాశీనులై యుందురు.)

అన్నం: దేవా! జయమింతవరకు మనవారలకే లభ్యమయినట్లున్నది. అదిగో! రణతిక్కని విజృంభణంబు గనుడు.

ఉ॥ ఎక్కడ వైరిమోహర మొకించుకవిచ్చి చలించుచున్న నిం
కెక్కడ నాత్మసేన విజయేప్సిత సిద్ధికి బేర్చుచున్న దా
నక్కడ నిక్కడ న్నిలిచి యీ రణతిక్కన పోర జూడ మీ
మ్రుక్కడి వైరులేగెదరు పుట్టకొక్కడు చెట్టుకొక్కడై.

మను: మంత్రీ! అవును. కాని యాతని మేను జూడుము. చిగిర్చిన మ్రానుంబోలె రక్తాక్రాంతమై యున్నది.

అన్నం: దేవా! అవంక చూడుము. మన మిత్రుడు కాళహస్తి పాప తిమ్మరాజెట్లు పోరాడుచున్నాడో?

మను: ఆతనిపైకి శత్రుసైన్యమును నడిపించువాడెవడో?

అన్నం: ఆత డారాధ్యబ్రాహ్మణుడు. పిన్నమనాయని సేనాని. బ్రహ్మ

రుద్రియాభిధేయుడు.

మను: ఆహా! ఆతడు మన రణతిక్కనంబోలె విజృంభించుచున్నాడు.

అన్నం: దేవా! ఇతనిని మన రణతిక్కననుం జూచిన నాకు పరశు రామవాక్యమొండు స్మరణకు వచ్చుచున్నది.

శ్లో॥ అగ్రత శ్చతురో వేదాః పృష్ఠత స్సశరం ధనుః
ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్రం శాపాదపి శరాదపి.

మను: అవును. మంత్రి, మంత్రీ! చూడుము. మన మిత్రుడు కాళహ స్తీశ్వరుండు హతుడయ్యె. అక్కటా! నేడెట్టి దుర్దినము! ఇంక మనవారెట్లు వైరుల ధాక కోర్చువారలో కదా?

అన్నం: దేవా! దుఃఖింపకుము. "యశోవా మృత్యుర్వా" యనలేదా?

కం॥ భీరువు తోంబదితొమ్మిది
సారులు మరణంబు గాంచు సాహససంప
త్సారుండు మాత్రి మొకటే
సారిగ మరణించునని చాటువు వినవే?

ఆతని కేమి? శక్త్యనుసారంబుగ బోరాడి వీరస్వర్గంబు జూర గొనియె.

మను: మంత్రీ! ఈ యుద్ధము జూచుకొలది నాకు బోర నుత్సాహము పెచ్చు పెరుగుచున్నది. ఈ విధమున మనమెంతకాల మిట్లు వేచియుండవలయునో కదా?

అన్నం: దేవా! మీ యుత్సాహ మొకింత బిగబట్టుడు. సమయము వచ్చినపుడు మీ రేగి కర్తవ్య మొనర్పవచ్చు.

మను: ఆ సమయ మెప్పుడు వచ్చునో? నిన్నయు మొన్నయు నట్లే యూరక వేచియుంటిమి కదా? నేడుగూడ నట్లగునో యేమో?

అన్నం: రణతిక్క డున్నంతవరకు నట్లేయగునని తోచుచున్నది.

మను: అన్నంభట్టూ! అటు చూడుము. అరరే! కాటమరాజు తన సైనికులనేదో గూఢమార్గమున మనసేన వెనుక భాగమునకు దెచ్చి పోరాడుచున్నాడు. పద్మనాయక పిన్నమునాయకులు మును విజృంభించుచున్నారు. అక్కటా! ఇక నేమగునో?

అన్నం: దేవా! ఇది కష్టసమయమే?

మను: మంత్రీ! ఇంకేమున్నది? చూడుము. మనసైనికులు మొగ్గవిచ్చి యెత్తినకాలు దించక పరువిడుచున్నారు. అక్కటా! యెట్టి పాపికాలము దాపరించెను?

ఉ॥ జన్యతలంబునం దతులశౌర్యపరాక్రమ రాజితారి మూ
ర్ధన్యులనెల్ల గెల్చిన పరాక్రమశాలికి మన్మసిద్ధిరా
జన్యున కాజి తోడయిన సాహసికోత్తము వీరులియ్యెడం
గన్యలమాడ్కి సంగర ముఖంబునచుండి తొలంగజొచ్చిరే?

అన్నం: దేవా! అదుగో రణతిక్కన వారికడ్డమై నిలిచి యుపాలంభన మొనర్చుచున్నాడు. వారు మరలకున్న మన మేగవలయు.

మను: ముందే పోవుదమురమ్ము. వారు మరలునట్లు తోచుటలేదు.

( నిష్క్రమింతురు )

# = ద్వితీయ రంగము =

( స్థలకము-పంచలింగాలకోన యుద్ధభూమి )

(సైనికులు చెల్లాచెదరై పరుగెత్తుచుండ రణతిక్కన రక్త సిక్తాంగుడై ఖడ్గహస్తుడై అడ్డమువచ్చి)

ర.తి: సైనికులారా! నిల్వుడు. నిల్వుడు. ఇదేమి విపరీతము?

ఉ॥ కోటికొలంది పోటుల నకుంఠితవిక్రమధుర్యులై నిరా
ఘాటముగా విరోధుల విఘాతమొనర్చి జయించి యిప్పుడీ
పాటిబలంబులం గదిసి పైకొని పోరగ నోహటింతురో
పోటరులార! మీరు మగపోడిమి నెంచరో? కీర్తి మించరో?

ఇదే నే మరలమిమ్ము మోహరించి వైరిదాక గొంపోయెద రండు. ఏల మీరిట్లు నా పలుకాలింపక నా సామర్థ్యంబు సంశయించునట్లు పరుగెత్తెదరు?

ఉ॥ నే దొలి ద్రోవదీయునెడ నిప్పునైనను, నీటనైన, మీ
రేదియు లెక్కలేక చరియించిన వేళలయందు మీకు నే
మాదిరి గీడుమూడె నెటు మానము నిల్వకపోయె, నే విధిన్
వేదన గల్గె మీ రిపుకు భీతిలి పర్వెడనేల భీరులై?

అదుగో మన వైరులు విచ్చిన వ్యూహంబు సవరించుకొని మన వైపున కేగుచున్నారు. మీ పౌరుషంబును జూప నిదే సమయము. రండు.

ఉ॥ అక్కట! బంటులార! యిటు లాత్మవిరోధులు విక్రమించుచో
సొక్కగ నాన వారు మనచొప్పున బెక్కురణంబులందు బెం
పెక్కినవారలో? లెక్కగొన నెక్కుడువారలో? విరోధి బారికిం

జిక్కనివారో? ధైర్యమున జిక్కనివారో? తలంప నేరరే?
ఇట్టి యవిమృశ్యకారిత మీకుదగునా? ఇదివిన్న మీ పరువు నిల్చునా?

సీ॥ విజయక్షమాధీశు, విజయాంకముంగొని
వెలసిన యనుపమ విక్రమంబు
రక్కసగంగని రాణువన్ ధ్వంసంబు
సల్పిన యసమానసాహసంబు
సారంగపాణి భూజాని నాహవమున
బట్టిన యశదృశప్రాభవంబు
బహ్మ నాక్కనలను బైకొనిరాజ్యంబు
గైకొన్న నిస్తులకౌశలంబు
తే॥గీ॥ నేటికీ పాటిగా గొల్లపోటరులను
దాకి విజయమంద బనికిరాకయున్న
సాటివారలలో నగుబాటుగాదె
మానధనులార! ధీర సన్మానులార!

ఉ॥ నెత్తిని నోరుబెట్టుకొని సేగరణీయము దెల్పుచుండ మీ
రెత్తిన కాలుదించ కిటువేగుట కీర్తికరంబె? సంగరా
యత్తులుగండు కండికను బ్రాణములుం దరితీపులంచు ను
న్మత్తులభంగి బారకను మానముమాత్రము తీపుగాదొకో!

ఉ॥ ఆలమొనర్చి నచ్చ యిసుమంతయులేక యశంబునిల్పు డం
చేలకో? యెంతజెప్పిన నొకింతయు మీ చెవి బెట్టకుండని
చాలున మొగ్గవిచ్చెదరు సైనికులార! యిదేమి నే జమా
పాలుడగానొ మీ రకట! పౌరుషవంతులుగారొ యేమొకో?

ఓరీ! పందలారా! ఎంత నుడివినను వినిపించుకొనక పరుగెత్తి ప్రాణముల రక్షించుకొన నెంచితిరా? అట్లైన బొందు.

ఉ॥ ఈ యెడ వైరులం జెనక నెంచనిచో నికబొందు పోయి మా శ్రీయము గోరువాని మను జెల్మనిజూచెడువాని, మాచమూ నాయకు వైరి కప్పన మొనర్చి పలాయనమైన యంగనా ప్రాయుల మే మటంచు సరివారల జాటి యశంబు గాంచుడీ!

ఓరీ! నృపాలులారా! మీరుదరండు. నా భటులు గాండిశీకులైనంత మించిపోయిన దేమియు లేదు. రండు. మీ మద మడంప నే నొక్కడ సమర్థుడ.

ఉ॥ సేసలు మొగ్గవిచ్చిచన జిక్కెనుపో రణశిక్కడంచు మీ రో నరపాలులార! ముదమొందకు డీయెడ సర్వసైన్య సంధానుల మిమ్ములన్ సమరధాత్రినిమార్కొని రూపుమాపగా నే నొకరుండ జాలుదు మరెవ్వరు నేటికి రండు పోరుడా!

(కాటమరాజు, పద్మనాయకుడు పిన్నయనాయకుడు బ్రహ్మ రుద్రయ్య ప్రవేశింతురు.)

పిన్న: శాంతింపుము. శాంతింపుము.

చ॥ మునుపటిమాడ్కి భూమిసురపుంగవ! నీ బలమెల్లవిచ్చి పా రిన జలియింప కాహవ ధరిత్రిని నొంటరి నిల్చినాడ వా జిని నినుదాక మాకిపుడు చిత్తము నూల్కొనకుండు గాన నిం కని ద్యజియించి క్రమ్మరభటావళి దోడ్కొనివచ్చి పోరుమీ!

ర.తి: ఓహో! మరల మునుపటియెత్తునే వేయుచున్నారా?

చ॥ మునుపొకసారి మీర లని భూసురుమార్గాన బ్రహ్మహత్య పై కొనునని పోరుమానుకొన గొంకక వెన్కకు బోయి నాడు త ప్పనుగలి వచ్చినాడదిక బోకజయంబునో లేకచావునో

గనియెదగాని సంగరముఖంబున నుండి తొలంగువాడనే?

నా ప్రాణము మీయదియైన గావచ్చుగాని నా మానముమాత్రము నాయదియేసుమీ? కావున మాటలువదలి యుద్ధమునకు గడంగుము.

పద్మ: ఆర్యా! నీ పౌరుషంబెంతయు ప్రశంసనీయము. పూచిన మోదుగుంబోలె దేహము రక్తసిక్తమైయున్నది. కాన నీ యమానుష కార్యంబునకు బూనినఫలమేమి?.

శా॥ హాహారాహారిగబోరి మీ భటులు యుద్ధోర్వి న్విసర్జించినన్
మీరంజాలని బాధ మీ యొడలు స్తంభీభూతమై యుండినన్
బీరంబు ల్విడకుండ మమ్మెనరగా బ్రేరేపగా నేల? యే
శూరుండైనను నేమి సేయగల డిచ్చో వీరచూడామణీ.

మరియు మీ ప్రస్తుతస్థితియందు నిలిచి పోరగలిగిన మీరు మాలో నొక్కరిని ద్రుంచగలరుగాని తుదకు మాచే జచ్చుట నిశ్చయము. ఏల మాకు బ్రహ్మహత్యా పాతకము దెచ్చి పెట్టెదవు? పిన్నమనాయకుడు నుడివినట్లు మరల సైన్య యుతుడవై రమ్ము.

ర.తి: అట్లెన్నటికి జేయువాడ గాను. మీ సంశయమ్ము వదలి మగవాడి గనుపింపుడు.

ఉ॥ భూసురు డీతడంచు ననుబోరున వైకొని బోరగూడదం
చీ సమయంబునందు వచియించుట చిత్రముగాదె? ఖడ్గశా
ణాసనముల్ ధరించి రణమందున నిల్చిన యంతమాత్ర నా
భూసురతావిశేషత సమూలముగా నడుగంటుటెంచరే?

మునుపే పీనుగకు లేని కుశంకలు మీకేల?

మ॥ సమరంబం దవనీసురాధ్యులగు నశ్వత్థామతో ద్రోణుతో
జమదగ్న్యాత్మజుతోడ నర్జుననదీసంజాతు లోక్కింత త్రా
సమునుం జెందక నోర్చియుండు నెడ నీచందాన మీబోంట్లుత్రా
సము జెందఁదగదింక మారుకొనుడీ శౌర్యంబె మీకున్నచోన్.

వైరులారా! సాధారణమ్ముగా బ్రాహ్మణేతరులు కయ్యమునకు గాల్దువ్వు బ్రాహ్మణునితో బోరుట పాతకముగాదని నిరూపించి నను మీరు మీ కుశంకల వదలక యొకరిమొగ మొకరు చూచుకొనుచు నిల్చెదరేల? ఏమీ- మీకు బౌరుషము లేదా.

మ॥ ధరణీదేవుడటంచు నన్నెదుర సంత్రాసంబు వోనాడి స
త్వరమాజింబొనరింపుడీ యనుచు నుత్సాహించి భాషించుచో
నరుదా శాంతము వీడకుండెద రిదే యజ్ఞోపవీతంబు నే
డ్తెరఖండించితి నేను శూద్రుడను రండీ పోరుగావింపుడీ.

మీరు నిక్కవముగా మగవారలైనచో నింక వెనుదీయకరండు.
(జంధ్యము తెంచివైచును)

కాట: (ముందునకువచ్చి కత్తిఝుళిపించుచు) మిత్రులారా! నన్నీ వాచాలు మదమణగింప యనుజ్ఞనిండు.

ఉ॥ పాపమటంచు బైకొనక పందలవైఖరి నిల్చియున్న నీ
బాపడు కర్ణకంటకపు బాసలనాడ గడంగెనింక నే
నోపగజాల విక్రమసమున్నతి వీనిసిదాకి ద్రుంచెదన్
బాపము పుణ్యమో ధరణిపాలక! పిమ్మట జూతు వీడుమా!

ర.తి: (ముందునకేగి) రా ధూర్తా! రమ్ము. నా ఖడ్గదేవతకు నిన్ను కబళంబొనర్తు.

పిన్న: కాటమరాజా! కొంచెమోర్పు బూనుము. మన మీతని బోరదగము.

బ్రిహ్మ: నృపేంద్రా! నామాట నించుక నాలకింపవలయు.

ఉ॥ ఇంతటిదాక మీరు వచియించుచు నుండిన సాంత్వనోక్తు లొ
క్కింతయు నాలకింపక యొకే విధిమార్గాని సంగరంబు గా
వింతునటంచు బల్కు పృథివీసురు దిక్కనతోడ బోర ని
శ్చింతగ నన్ను బంపు డనిసేసి జయించెద ధారుణీశ్వరా?

పిన్న: సేనానీ! బాగుగా బలికితివి. మేమే యీ వీరుని పట్టుదల బరి
కించి నిన్ను యుద్ధమున కంపదలచుచుంటిమి. అట్లే కానిమ్ము.

కాట: సేనానీ! ఈతనితో బోరి మా కసినంతయు దుదముట్టింపుము.

బ్రిహ్మ: నిక్కవముగా నట్లేయొనర్చెద. (ఖడ్గహస్తుడై తిక్కనకడ
కేగి)

ఉ॥ భూసురవర్య! నిన్నెదిరి పోరగజాల డొకండటంచు బే
ర్మోసిన వాడవంచు మునుమున్వినియుంటుట మిమ్ముదాకు బే
రాసను వేచియుండ నిపుడయ్యది చేకుఱె, నింక ఖడ్గబా
ణాసనముల్ ధరించి సమరానని నన్నెదిరించి పోరుమా!

ర. తి: భళీ! ఇప్పటికొక్క శూరుండీ వైరులగన్పట్టె.

చ॥ పాలికలన న్ధరామరుని బోరిన బాపమటంచు నీ నృపుల్
కలవరమందు వేళ నొడికంబున వారికి భీతిగూర్పగా
గలనున నన్నుదాక సమకట్టిగ సాహసముం బొనర్చితే
భళి భళి! నీకు లాతిమగవారలు సాటియె బ్రిహ్మనుద్రియా!

రమ్ము. పోరుదము. (ఇద్దరును ఖడ్గంబులతో బోరి యుద్ధరును
సమయుదురు)

పద్మ: పిన్నమనాయకా! చూచితే యీ భూసురులిద్దరును మడసిరి.

పిన్న: నే ననుకొనినట్లే యైనది. రణతిక్కన రణశాంతుడై బాణ

జర్జరితాంగుడై యుండ బ్రిహ్మారుద్రియ్యుచే బడియె. కాని మ్మా వార్త మనుమసిద్ధికంపి మనము నేటికి రణముచాలించి శిబిరంబుల కేగుదము.

కాట: మిత్రిలారా! అదుగో మనుమసిద్ధి. అన్నంభట్టునిగూడి యిటే వచ్చుచున్నాడు.

పిన్న: ఇంక మనము శిబిరమున కేగి రేపుమరల యుద్ధమున కుపక్రమింతము. (నిష్క్రిమింప, మనుమసిద్ధి, అన్నంభట్టు ప్రివేశింతురు)

మను: అన్నంభట్టూ! ఎంత నిశ్శబ్దముగానున్నది. కార్యమేమైన మించిపోయియుండునా?

అన్నం: రాజా! అల్లే యున్నది. అక్కటా! అదుగో రణతిక్కన రణక్షోణి జర్జరితాంగుడై పడి యున్నాడు. (డాసి రణ తిక్కన దేహము తాకిచూచి) అక్కటా!

శా॥ లేరీ లోకములోన నెందునను నీలీలం బ్రతాపోద్ధతిం
బోరంజాలిన శూరశేఖరులు సంపూర్ణ ప్రతాపోదయుల్
సారోదారపరాక్రమాఢ్యులనుచున్ స్వాంతమునన్ నమ్మచో
హారాహారిగబోరి యీ రణమునం దోటొందితే తిక్కనా!

ఇంక మాకు దిక్కెవ్వరు?

మను: (తిక్కన నెంబడి గూర్చుండి) అక్కటా! మిత్రమా?

శా॥ ధౌరంధర్యమునన్ బరాక్రిమమునన్ ధైర్యంబునన్ సంగరో
దార ప్రౌఢిమ సాహసిక్యమున నౌదార్యంబునన్ వాహినీ
పారీణత్వమునన్ ధరాతలమునన్, వాహిన్యధీశౌఘమం
దేరీ నీకెదు రంచు నెంచ నిటులైతే ఖడ్గతిక్కాగ్రిణీ!

సోమండిల సాక్షిగా, పెన్న సాక్షిగా, సర్వజనంబులు సాక్షిగా మా

ఋణమును సర్వంబును సంపూర్ణముగా దీర్చితివి. ఇంతకంటె నీవునకు గామ్యమెద్ది? ఇంక మేము మిత్రఋణముం దీర్చు కార్యంబున నప్రమత్తులమై చరించెదము. అందులకా హరిహర నాథుండు మాకు దోడగుగాక.

అన్నం: తథాస్తు. దేవా మనకింక నడియే కర్తవ్యము.

మను: ఓరీ! ధూర్త విరోధులారా! ఇక మీపని బట్టించెద జూడుడు.

శా॥ మాకాప్తుండగు ఖడ్గతిక్కనను సంహారంబు గావింప న
స్తోకానందము నందబోకు డిదె తోడ్తోబోగున న్నానికా
నీకమ్మెల్లను తోడితెచ్చి మిముల న్నిర్మూలముం జేసెదన్
గాకున్నన్ పితృగూడబోయెదను స్వర్గంబే ససైన్యంబుతోన్.

అన్నం: భగవ దనుగ్రహంబున మీకు జయము లభించుగాక!

(మనుమసిద్ధి నిష్క్రమింప, అన్నంభట్టు, తిక్కన కళేబరము నెత్తుచుండ తెర వాలును)

## = తృతీయ రంగము =

స్థలకము— నెల్లూరు, సిద్ధనగృహము.

(సిద్ధన, జానాంబ, పోలాంబ, చినతిక్కన రోదసీనులైయుండ అన్నంభట్టు ఎడముగా నిలబడియుండును)

సిద్ధ: అన్నంభట్టూ! తర్వాత నేమిజరిగినది.

అన్నం: ఇంకను మీరు గ్రహింపలేదా?

మ॥ సమరాంభోనిధి ఖడ్గమందిరమును న్మంధించి, బాహాబల
ప్రమదంబార మధించి; యుజ్జయ సుధాపానంబు గావించి దు

ర్ధమ విద్వేషులచేత నంతమున నంతఃబందియుం గీర్తి కా
యమునుం దాల్చెను మీ సుతుండు, రణతికాంక్షుండు
శూరాగ్రణీ!

సిద్ధ: ఆహా! అనుకొనినట్లే యైనది. ఐననేమి? దీనికి జింతింప నేల? 'కా చింతా మరణే రణే' యని యార్యు లనలేదా?

ప్రోలాం: నాథా! పుట్టినవాడు గిట్టకపోవడు. కాని యిట్టి సర్వజన సంస్తూయమానమగు మరణము గాంచుట మన కెంతయు సంతోషదాయకము.

జానాం: అత్తగారూ! ఇట్టి వీరమరణమేకదా పురుషులకు గామ్యంబు! వారికేమి? వారు పురుషులైనందులకు పురుషధర్మంబును, వీరులైనందున వీరధర్మంబును, రాజభృత్యులైనందున, రాజభృత్యధర్మంబును, మాన ధన వంశసంజాతులైరి మాన ధన వంశాచార ధర్మంబులను నిర్వర్తించి మృతజీవులైరి. ఇక నా కాంతునితోడ సహగమన మొనర్చుట కనుజ్ఞ యొసంగవలయు ఆయన తనకర్తవ్యమొనర్చె. ఇక నేను నా కర్తవ్యము నెరవేర్ప వలయుగదా?

ప్రోలాం: సాధ్వీమణీ! అట్లేయగుగాక నీ ప్రవర్తనచేత మావంశము పావనంబగుగాక.

చి.తి: తాతగారూ! మా తండ్రి వీరస్వర్గము జూరగొని మాదృశు లకు మార్గదర్శకుడయ్యె. ఇక నాకాతని ఖడ్గమిచ్చి నన్నాతని శాత్రవులపై కంపుడు.

సిద్ధ: నాయనా! త్వరపడకుము. అన్నంభట్టూ! మా కుమారుని వీర మరణంబును విస్తరించి వర్ణింపుము విని యానందించెదము.

అన్నం: భూకాంతీశ్వరా! ఆలకింపుము.

సీ॥ హితభూప సైనిక ప్రతతితో నాక్రాంత
ప్రౌఢ శాత్రవులతో బోరిపోరి
హితభూప బలములు హతమైన తన రౌతు
దళముతో వైరుల దాకిదాకి
తనరౌతుదళము విచ్ఛిన్నయంత తన భటా
వళితోడ సహితుల గలసి కలసి
తన భటావళి నెక్కజనినంత రణభిక్షు
బెట్టు విద్వేషుల వేడి వేడి
తే॥గీ॥ కట్టకడ శత్రువుల మొనగాని బ్రహ్మ
రుద్రియను దాకి యాతని రూపుమాపి
సర్వజనముల ఋణముల జక్కదీర్చి
మీ తనూజుండు తిక్కన మేను బాసె.

సిద్ధ: ఏమీ! మా తిక్కన యొక్క బ్రహ్మరుద్రయ్యతో బోరి సమ
సెనా.

చి.తి: మాతండ్రిగారేమి? బ్రహ్మరుద్రయ్యబోలువారికి లొంగుటేమి?

అన్నం: అందులకై అచ్చెరువందకుము. ఆ శూరవరేణ్యుండు బ్రహ్మ
రుద్రయ్యతో బోరునప్పటికి మోచినమోకుగవలె ఖడ్గ
ప్రఘాత జర్ఝరితాంగుడై యుండె.

మ॥ రణవిశ్రాంతుడె కానిచో రిపుశరగ్రస్తాంగుడే కానిచో
రణరంగంబున బ్రహ్మరుద్రాదులకునే క్రమ్మాదింపగారాని, మీ
రణతిక్కం డా కబ్రహ్మరుద్రయనుమాత్రం బాజిడిగొన్న మా
రణముంజేయక ప్రాణమిచ్చునని మీరలుసంత యోజింపరే?

(లోపల పల్లకిమోత వినబడ) అరుగో! బోయులు రణతిక్కనం
దెమ్ముచున్నారు. ఇక తదనంతర కర్తవ్యమునకు గడంగుడు

మహిమసిద్ధియు కాటమరాజుతో బోరి యిద్దరును హతు
లైరి. ఇక నెల్లూరు రాజ్యస్థాపనమునకు మీరుబూనుకొనుడు.

సిద్ధి: (అందరును లేవ) ఏడీ! నా పుత్రవతంసుడు. (చూచుద్రోవ భీముడు వచ్చును.) అన్నంభట్టూ! ఆయెడు రేగు మహానుభావుం డెవడు? చూడుము.

అన్నం: మంత్రీశ్వరా! ఆమహానుభావుడు శాపానుగ్రహశక్తియుక్తుడగు వేములవాడభీమకవిసార్వభౌముడు. మీ పుణ్యపరిపాకమున మీకు శుభమెద్దియో యొనర్ప మీకీతరుణమున దర్శనమిచ్చె. జానమదేవీ! నీవేగి యాతనిపాదములపైబడి యాతని యమోఘాశీర్వచనముల బడయుము.

జానాం: అట్లే యొనర్చెద. (భీముడ ప్రవేసింప జానాంబ యాతని పాదములపైబడును.)

భీమ: కళ్యాణీ! దీర్ఘసుమంగలీభవ. లెమ్మి. (జానాంబ లేచినిలువబడును)

అన్నం: కవివరేణ్యా! నీయాశీర్వచనంబు సఫలమగుగాక. అయిన నాకుమాత్రమిది మసాధ్యమని తోచుచున్నది. ఏలయననీమె భర్త రణతిక్కన నిన్న సాయంసమయమున రణరంగమున నీల్గె. అదుగో! నాతని శవమును బోయలిటకు దెచ్చుచున్నారు.

భీమ: ఏమీ! (చూచి) అగుగాక. అయినంతమాత్రమున నాకేమి?

ఉ॥ హైమవతీ సనాథ కరుణార్జిత దివ్యవచో విలాసుడన్
వేములవాడ భీమన కవిప్రవరుండను నేనువచ్చి యీ
కోమలి మిన్న జానమను గూరిచి దీర్ఘసుమంగలీత్వ శో
భామహితైవెలుగుమని పల్కిన దీవనరిత్త పోవునే?

సిద్ధి: తప్పకుండవలయునని యే మా యాశయము.

(తిక్కన లోనికిఁగొనిరా సిద్ధనాయులాతని దండ కేగుచో వారించి)

భీమ: మీరందఱును దూరముండుఁడు. నేను మీ కుమారునిం బిలిచి రప్పించెద.

కం॥ కొట్టఁబడు సిద్ధతిక్కన
నెట్టన నే బిలుచుచుండ నిను గొంపోవం
గట్టడి కాలునకగునా
దిట్టడవై లెమ్ము రమ్ము దీవనఁగొమ్మా!

ర.తి: కవిచంద్రా! మీ మాహాత్మ్యము నే నేమని వర్ణింతు?

శా॥ వీరాసీక కరాసి ఘాతములచే వీత ప్రబోధుండనై,
వీరస్వర్గము జూరగొంటినని యువ్విళ్ళూరితింగాని మీ
కారుణ్యంబొకయింత నాయెడలఁగల్గన్ బ్రాణముల్గంటి నో
సూరిగ్రామణి! నాతరంబె తమ వాక్శుద్ధిం బ్రశంసింపఁగన్?

భీమ: ధీరాగ్రణీ! ఇంతకు నన్ను బ్రశంసింపనేల? ఇక మీ తల్లిదండ్రులకడ కేగుదము.

(రణతిక్కన తలిదండ్రులకు మ్రొక్కి వారి యాశీర్వచనములంది కుమారుని కౌగలించుకొనును)

జానాం: (మోకరించి) దేవా! మీ కెంతయు కృతజ్ఞురాలను.

శా॥ శాపానుగ్రహశక్త్యుపేత కవితాసామ్రాజ్య ధౌరేయు లీ
క్ష్మాపై బాపఁగరాని దుఃఖములు సంకల్పింపఁగారాని. సా
ఖ్యాపాతంబులు లేవు లేవనెడు నార్యప్రోక్త వాక్యంబులున్
నాపుణ్యంబున రూఢియయ్యెఁ గవిచంద్రా! సాంద్రకీర్త్యుజ్జ్వలా!

భీమ: అమ్మాయీ! లెమ్ము. భర్తంగూడి చిరకాలము సుఖింపుము.

అన్న[illegible]ంహా! మీబోటి కవిచంద్రులుండుట మాపూర్వ పుణ్యఫలము.

సీ॥ నవభావనాపూర్ణ నానాప్రపంచ ని
ర్మాణ పంకరుహాసంభవులు కవులు
జీర్ణాగసంకాశ చిత్తప్రఫుల్ల కృ
తప్రథితవసంత వైభవులు కవులు
పావనాదర్శ సంభావనా మోహకృ
త్ప్రాభవాంచిత మనోభవులు కవులు
స్థావరజంగ మోచ్చయనైజ రమ్య ప్ర
భావ రహస్యాను భవులు కవులు

తే॥గీ॥ దేశసంసేవనా ముఖోత్కృష్టధర్మ
పథ నిదర్శనధర్మ ప్రభవులు కవులు
కవులు సేయగజాలని గార్యమొండు
కలిగియుండదు కలుగదు కలుగబోదు!

భీమః అన్నంభట్టూ! నే నేగద. మీ నెల్లూరంతయు నిట్టి వీరులతో నిండియుండుగాక.

అన్నం: మీబోటి కవి శేఖలతో గూడా నిండియుండుగాక. మరియు—

— భరత వాక్యము —

సీ॥ రణపరాజితుడగు తనయువర్జించు సి
ద్ధనమంత్రి బోలిన తండ్రులలర
మానహీనుండగు సూను నిందించు ప్రో
లాంబను బోలిన యమ్మలలర
కాందిశీకుండగు కాంతు హసించు జా
నాంబనుబోలు నర్గాంగులలర

దేశసేవార్థంబు దేహమర్పించెడు
రణతిక్కనంబోలు తనయు లలర
తే॥గీ॥ నాదికారణు డార్త్తజనావనుండు
సాహసౌదార్య గుణముల సంపదలను
ధర్మసంసక్తి కార్య సంధానరక్తి
బొసర హైందవజనముల బ్రోచుగాత!



# మార్కండేయ

గ్రంథకర్త: కీ. శే. ముత్తరాజు సుబ్బారావుగారు

" లిఖితమపి లలాటే ప్రోచ్యితుం కస్సమర్థః "
అంటే మృకండమహర్షి సుతుని షోడశవర్ష ప్రాయముననే దుర్ఘట మస్సహాతపస్సిరతిచే ప్రేతనాథుని ప్రతిఘటించి మృత్యుంజయుడై పరమేశ్వరానుగ్రహమున చిరంజీవి యగు మార్కండేయుని నామముననే బేర్కొనవలయు.

షోడశవర్షమే ఆయుర్దాయ మని బ్రహ్మ లిఖితం. శంకరుడు తన భక్తుని చిరాయుష్మంతునిగ ఆశీర్వదించాడు. త్రిలోక సంచారి నారదుడు యముని ప్రేరేచాడు. ప్రేత నాథుడు పరువుకోసం మార్కండేయుని జీవాలు గ్రహించాలని పాశం వేసి పరాభవం పొందాడు.

మృత్యుంజయుని చరిత్ర పఠనార్హము. ముక్తి దాయకమైన ఈ పౌరాణిక నాటక రాజమును పఠించిన మృత్యువును జయింపవచ్చును. అట్టి " మృత్యుంజయ విలాసము " మార్కండేయ చరిత్ర నాటకరూపమున కీ. శే. ముత్తరాజు సుబ్బారావుగారిచే రచింపబడి మా గ్రంథమండలి నలంకరించింది. నేడే యొక ప్రతిని మా గ్రంథమాలనుండి తెప్పించుకొని మీ గేహమును పావిత్ర మొందించి తరించండి. వెల రు 0—12—0

వలయువారు: సరస్వతీ బుక్ డిపో బెజవాడ.

Printed at Usha Press, Telaprolu, Kistna Dt.